

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

వెల 4 అణాలు ANDHRA PATRIKA ILLUSTRATED WEEKLY 10-5-19

# వార్తలు — వింతలు



విమాన బోధకుల శిక్షణావిమానం.



మార్షల్ సహాయం సగం జరిగినందుకే అమెరికా ఉత్సవం జరిపింది. డీన్ ఆఛిసన్, మార్షలుకు ఈ ఆల్బం బహూకరిస్తున్నారు.



లండన్ బస్సుకండక్టర్ల ట్రెయినింగ్ స్కూలు.



ఇండియా ఏనుగుగున్నకు, 'పయాం' మిత్రము 'జెన్నీ' అనే ఏనుగుగున్న కూడా 'వాషింగ్టను చేరింది.

# ఆంధ్రపత్రిక


సంవత్సరచందా
రు. 12-0-0

విడిప్రతిక
4 అణాలు

ప్రతిబుధవారము ప్రకటింపబడును.

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తనమనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్
(మహాభారతము)

Founder : K. NAGESWARA RAO.

సంపుటము **42**

సంచిక **36**

వికృతి సంవత్సర వైశాఖ బహుళ నవమి - బుధవారము




భూగర్భంలో నిర్మించిన మోటారుశాల—శాన్ ఫ్రాన్సిస్కో.



ఆంధ్రపత్రిక

1950-వ సం॥ మేనెల 10-వ తేది బుధవారము

# కొత్త మంత్రివర్గం

ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ లాంఛనంగా తన మంత్రివర్గ రాజీనామాను అధ్యక్షునకు సమర్పించారు. అధ్యక్షుడు తిరిగి పండిట్ నెహ్రూను ప్రధాన మంత్రిగా నియమించారు. ఇతరమంత్రుల నియామకంలో సలహా ఇవ్వవలసిందని కోరారు.

పాతవారితోనే కొత్త మంత్రివర్గం ఏర్పడింది. డాక్టర్ శ్యామప్రసాద్ ముఖర్జీ, కె. సి. నియోగీల స్థానంలో మాత్రం మున్షీ, హరికృష్ణమెహతాబ్ లు మంత్రివర్గంలో చేరారు. మంత్రివర్గంలో జరిగిన మార్పులు గాని, ఆ మార్పులు జరిగినవిధానంగానీ తృప్తికరంగా లేదు.

కేంద్రమంత్రివర్గంలో మార్పులు జరగబోతున్నవని దాదాపు సంవత్సరంగా వదంతులు ప్రబలినవి. మంత్రివర్గంలోని కాంగ్రెసేతరులు ఎప్పటికప్పుడు రాజీనామా ఇచ్చిపోదామని అనుకుంటున్నట్లు ప్రచారమైన వార్తలు సత్యదూరంకావని మొన్నటిదినం వెలువడ్డ అధికారప్రకటన స్పష్టంచేసింది.

ప్రస్తుతం ఆర్థికమంత్రిగా ఉన్న డాక్టర్ మత్తాయ్ ఈ నెలాఖరువరకూ మంత్రిగా ఉండేందుకు అంగీకరించారు. అలాగే జయరాందాస్ దౌలత్రాం, మోహన్లాల్ సాక్సేనాగార్లుకూడా వారి స్థానాలను ఆక్రమించేవారు లభించేవరకూ మంత్రులుగా ఉండేందుకు అంగీకరించారు. రాజగోపాలాచారిగార్ని మంత్రివర్గంలో చేరవలసిందని అర్థించారు. వారందుకు అంగీకరింపవచ్చునని ఆశిస్తున్నారు. అలాగే ఉత్తర ప్రదేశ్ ముఖ్యమంత్రి గోవిందవల్లభపంత్ కూడా మంత్రివర్గంలో చేరువిషయం సందిగ్ధంగానే ఉన్నది.

ఈ విధంగా దాదాపు మంత్రివర్గంలోని సగం స్థానాల విషయం ఇప్పటికి అనిర్ణయంగా ఉన్నప్పుడు ఇంతలోనే పాతవారితో కొత్త మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయవలసిన అగత్యం ఏమి వచ్చింది? ఈ విధంగా తరుచు మంత్రివర్గంలో మార్పులు చేస్తూ ఉన్నందువల్ల సక్రమపరిపాలనానిర్వాహణకు అంతరాయాలు కలుగక తప్పదు.

ముఖ్యంగా ఆర్థికమంత్రిపదవివిషయంలో దాదాపు ప్రతి సంవత్సరం మార్పులు జరుగుతూ ఉన్నందువల్ల ఖచ్చితమైన విధానాన్ని అమలుజరపడం సాధ్యం గాకుండా ఉన్నది. షణ్ముఖంచెట్టిగారు ఆఖరుపర్యాయము బడ్జెట్‌ను ప్రతిపాదిస్తూ ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం ఆయవ్యయఅంచనాలను తయారు చేసి ప్రతిపాదించడంకంటే అయిదేళ్ల ఆయవ్యయ అంచనాలను దృష్టిలో ఉంచుకొని వార్షికబడ్జెట్‌ను తయారుచేయడం మంచిదన్నారు. వారు ఆ బడ్జెట్‌ను ఆవిధంగానే తయారుచేశారు. అంతలోనే వారు ఆ పదవినుండి విరమించారు.

ఇప్పుడు డాక్టర్ మత్తాయ్‌కూడా వారినే అనుసరిస్తున్నారు. ఈవిధమైన మార్పులు సత్పరిపాలనకు, సక్రమపరిపాలనకు ఎంతమాత్రం తోడ్పడవు. మంత్రివర్గనిర్మాణానికి బాధ్యులైనవారు ఒక పద్ధతినిగానీ, ఒక విధానాన్ని గానీ, అనుసరించడంలేదనే ఈ మార్పులు సూచిస్తున్నవి.

ఏ పక్షానికి చెందినా సరే ప్రతిభావంతులతోనే మంత్రివర్గాన్ని ఏర్పాటుచేయాలని గాంధిమహాత్ముడు హెచ్చరించారు. మొదటి మంత్రివర్గం కొంతవరకు ఆప్రకారమే ఏర్పడింది. కాని ఆతరవాత ప్రతిభ, అప్రధానమై ప్రాంతీయాభిమానాలు ప్రాధా

న్యంవహించెను. కనుకనే కొన్ని ప్రాంతాల సమస్యలు కేంద్రప్రభుత్వానికి అవగతము కావడములేదు. ప్రాంతీయప్రాతినిధ్యము మంత్రివర్గనిర్మాణానికి ప్రాతిపదిక అయితే ప్రతిభ అంతా ఏ ఒకటి రెండు రాష్ట్రాల్లో మాత్రమే కేంద్రీకృతమై ఉండలేదు అని చెప్పవలసివచ్చును.

కేంద్రమంత్రివర్గంకూడా రాష్ట్రమంత్రివర్గస్థాయికి వచ్చుట శోచనీయం. రాష్ట్రముఖ్యమంత్రులుగా ఉండి వ్యవహారాలను నడుపుతున్న హరికృష్ణ మెహతాబ్, గోవింద వల్లభపంత్ గార్లను ఆరాష్ట్రములనుండి కదిలించవలసిన అవసరం ఏమి వచ్చినది? అలాగే దౌలత్రాంగారిని అస్సాం గవర్నరుగ పంపి, శ్రీ ప్రకాశ్ గారిని కేంద్రమంత్రివర్గంలోకి తీసుకు రావాలనే ఆలోచనలు ఎందుకు రావాలి?

భారత రిపబ్లిక్ అధ్యక్షుడు, వారి ప్రధాన మంత్రికూడా మంత్రివర్గాన్ని నిర్మించేటప్పుడుగాని, పునర్నిర్మించేటప్పుడుగాని భారతదేశం ఏ నాలుగైదు రాష్ట్రాలే అని భావించుట హర్షింపతగ్గవిషయం కాదు. ప్రతిభకు అగ్రస్థాన మివ్వవలసినదే. కాని ఆ ప్రతిభ ఎక్కడెక్కడ ఉన్నదో కూడా విచారించి, అన్ని ప్రాంతాలకూ మంత్రివర్గంలో ప్రాతినిధ్యం ఉండేటట్లు చూడవలసిన బాధ్యత అధ్యక్షుడు, ప్రధానమంత్రిపై ఉన్నది. వారాబాధ్యతను ఎంతవరకు న్యాయంగా నిర్వహిస్తారో చూడవలెను.

# నెహ్రూ ఉద్బోధ

పాకిస్తాన్ ప్రధానమంత్రి అమెరికాశాసనసభల సమావేశంలో, భారత ప్రధానమంత్రి పాకిస్తాన్, భారతపత్రికాసంపాదకులసభలో చేసిన ఉపన్యాసాలను గమనించితే భారత - పాకిస్తాన్‌సఖ్యత కేవలం ఆదర్శంమాత్రమే కాదని, అది సిద్ధించగల లక్ష్యమే అని స్పష్టమౌతుంది.

పండిట్ నెహ్రూ తన ప్రభుత్వవిధానాన్ని వివరించారు. ఆ విధానం జయప్రదం కావడానికి ఏ పద్ధతులను అనుసరింపదలచారో వెల్లడించారు. ఆ పద్ధతుల ద్వారా ఫలితాన్ని సాధించడానికి ప్రభుత్వానికి సహాయపడవలసిందని పత్రికాసంపాదకులకు విజ్ఞప్తి చేశారు.

ఇరుగుపొరుగునఉన్న దేశాలు సఖ్యతతో ఉండక తప్పదు. అలాంటి సఖ్యత లేనప్పుడు సంఘర్షణ అనివార్యం. ఫలితం ఒకదేశం మరొకదేశంలో కలసిపోవడమే. అందువల్ల సంఘర్షణకు కారణభూతమైన సమస్యలు పరిష్కారం కావు. పండిట్ నెహ్రూ తన ఉపన్యాసంలో ఇదేవిషయాన్ని ఉద్ఘాటించారు. ప్రజలు ఈ విషయాన్ని గ్రహించేటట్లుచేయవలసిన బాధ్యత పత్రికలదని ప్రధానమంత్రి ఉద్బోధించిరి.

రాజకీయజ్ఞులు ప్రజాక్షేమముదృష్ట్యా వివిధ సమస్యలను పరిశీలించి వాటి సత్వరపరిష్కారానికి సరియైన మార్గాలను అనుసరించినంతవరకూ పత్రికలు తోడ్పడుతూనేఉన్నవి. యథార్థానికి భారతదేశంలోని జాతీయపత్రికలు కాంగ్రెసును, కాంగ్రెసుప్రభుత్వాలను సమర్థిస్తూనేఉన్నవి. కనుకనే, ప్రభుత్వం ఇన్ని క్లిష్టసమస్యలలో ముఖ్యమైన ఆర్థిక, సాంఘిక సమస్యలను ఈనాటివరకూ పరిష్కరింపలేకపోయినప్పటికీ, పరిపాలనను యథాప్రకారం కొనసాగించ కలుగుతున్నది.

భారత-పాకిస్తాన్‌సఖ్యతసాధనకు ప్రధాన మంత్రి తెలిపినట్లు ఉభయదేశాల్లోని పత్రికలూ ఎక్కువగా తోడ్పడగలవు. భారతపత్రికలు ఈ విషయంలో ఇంతవరకూ తమ బాధ్యతను ప్రశంసనీయంగానే నిర్వహించినవి.

నేడు పాకిస్తాన్-భారతదేశములలో ఏర్పడిన విపరీతపరిస్థితులకు కారణము పత్రికలుగాక రాజకీయవేత్తల విధానములే అని చెప్పవలెను. కొందరు రాజకీయవేత్తలు పత్రికలపై ప్రాబల్యం సంపాదించి వాటిని తమ లక్ష్యసాధనకు వినియోగించుటకూడా జరుగుచున్నది. అట్టి పత్రికలపై ప్రభుత్వమే ప్రజాభ్యుదయం, దేశశాంతిభద్రతలదృష్ట్యా అవసరమైన చర్య తీసుకోవలసివుంటుంది.

పత్రికలకృషి ఫలితాలకు రావాలంటే ప్రభుత్వంకూడా తనబాధ్యతను తృప్తికరంగా నిర్వహించాలి. దేశంలో ప్రజలు ఆర్థికంగా, సాంఘికంగా అధోగతి

సాలై ఉంటే ప్రభుత్వసంకల్పాలనుగురించి ఎవరు ఎంత ప్రచారంచేసినా ప్రయోజనం ఉండదు. యుద్ధానంతరం దాదాపు అన్ని దేశాలూ, ఒక్క అమెరికా తప్ప, ఒకే స్థితిలో ఉన్నవి. అన్ని దేశాలనూ ఒకే విధమైన సమస్యలు ఎదుర్కొంటూఉన్నవి. వాటి పరిష్కారానికి అన్ని దేశాలూ సమష్టికృషి చేయక తప్పదు.

నిన్న మొన్నటివరకూ ఏకదేశంగా ఉన్న ఇండియా, పాకిస్తానులు ముఖ్యంగా ఆర్థిక, వ్యాపార, రక్షణవిషయాల్లో ఏకవిధానాన్ని అనుసరింపకతప్పదని భారతీయనాయకుడు మొదట్నుంచీ హెచ్చరించుతూనే వచ్చారు. అందుకు వారు ఇదివర్లో చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. అందుకు పాకిస్తాన్ వైఖరే కారణం. పాకిస్తాన్‌నాయకులు ఇప్పటికైనా ఈ విషయాన్ని గ్రహించగలిగారు. భారత-పాకిస్తాన్ ఆర్థిక, రక్షణ, వ్యాపారవిషయకసమాఖ్యనిర్మాణం సులభం కావచ్చు. అందుకు పాకిస్తాన్‌పత్రికా సంపాదకులు మనస్ఫూర్తిగా కృషిచేయవలసి ఉంటుంది.

---

# విషయానుక్రమణిక
## 10 మే 1950

# నేటిప్రపంచం

## అమెరికాలో పాకిస్తాన్ ప్రధాని

"వెనకపడ్డ" దేశాల ప్రభుత్వాధిపతుల్ని లాంఛనంగా ఆహ్వానించడం విందులివ్వడం, తమ దేశంలో భాగ్యాన్ని చూపించడం, నలుగురిమధ్యకీ పంపి పలకరించుకోనివ్వడం ఈమధ్య అమెరికన్ ప్రభుత్వం ఒక కార్యక్రమంగా పెట్టుకుంది. ఈ కార్యక్రమం 1949 లో ప్రారంభమయింది. ఇప్పటికి ఫిలిప్పైన్స్ చిలీ, పర్షియా, భారతదేశాలవంతు తీరిపోయింది. భారతదేశంనించి ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ వెళ్లారు. ఇప్పుడు ఈ మాసంలో పాకిస్తాన్ ప్రధానివంతు వచ్చింది పండిట్ నెహ్రూవంతు వచ్చినప్పుడు పాకిస్తాన్ ప్రధానికి వంతు ఇస్తారో లేదో అనే అనుమానంతో పాకిస్తాన్ అంతా ఉక్రోషంతో లోలోన ఉడికింది. ఈ అదనుచూసి రష్యా పాకిస్తాన్ ప్రధాని లియాఖత్ ఆలీని ఆహ్వానించింది. లియాఖత్ ఆలీ వెడతాననికూడా అన్నాడు. తీరా వెడితే రష్యా పాకిస్తాన్ల మధ్య స్నేహం సంధి ఏవైనా కుదురుతాయనే భయంతో అమెరికన్ అధ్యక్షుడు ట్రూమన్ లియాఖత్ ఆలీకికూడా ఆహ్వానం పంపాడు. తన మిత్రుడు పర్షియన్ షాని పాకిస్తాన్ పంపి పాకిస్తాన్ రష్యాతో చేరకుండా ముందు కట్టుదిట్టం చేసుకున్నారు. అమెరికాని కేవలం భయపెట్టడానికి మాటవరసకోసం రమ్మన్నారుకాని నిజంగా లియాఖత్ ఆలీ తమ దేశం రావాలనే కోరిక రష్యాకి ఆట్టే కనిపించలేదని తేలిపోయింది. నెహ్రూని తీసికెళ్లి అమెరికా ఏవో భాగ్యం ఒప్పగిస్తుందనే అనుమానం తీరిపోగానే లియాఖత్ ఆలీ ట్రూమన్ ఆహ్వానాన్ని స్వీకరించాడు. దాని ఫలితమే ఇప్పటి సంచారం.

అమెరికాబయల్దేరేముందు ఇండో-పాకిస్తాన్ ఒడంబడికవల్ల లియాఖత్ ఆలీ పలుకుబడి కూడా హెచ్చింది. ఆహ్వానించిన అమెరికన్లు లియాఖత్ ఆలీని పండిట్ నెహ్రూతో సమానంగా ఆదరించినట్లు స్పష్టపడాలని శతవిధాల ప్రయత్నిస్తున్నారు. ఇది ఎవరైనాకని పెట్టగలిగివుంటారో లేదోనని మాటల్లో కూడా చెప్పారు. సరిగ్గా నెహ్రూకి ఎన్నిచోట్ల ఎన్ని పర్యాయాలు' ఏరీతిగా మన్ననలు జరిగాయో, వీసం వ్యత్యాసం లేకుండా పాతరికార్డులు తిరగేసుకుని చూసి మరీ మన్నిస్తున్నారు.

ఇండో-పాకిస్తాన్ ఒడంబడికద్వారా ఉభయదేశాలమధ్యను పరస్పరవిశ్వాసం, మైత్రి ఏర్పడుతున్న ఈ సమయంలో అమెరికా వెళ్లిన లియాఖత్ ఆలీఖాన్ భారత ప్రభుత్వానికి విరుద్ధంగా ప్రచ్ఛన్నప్రచారం ప్రారంభించారు.

పాకిస్తాన్‌కి శత్రుభీతి లేకుండా చేసినట్లయితే సైన్యాలకోసం పెట్టుతున్న ఖర్చుని తగ్గించవచ్చునీ, ఇప్పుడు పెట్టుతున్న ఖర్చు అపరిమితంగా ఉన్నందువల్ల పాకిస్తాన్ ఆర్థికపునరుద్ధరణ సాధ్యపడ్డంలేదనీ లియాఖత్ ఆలీఖాన్ చెప్పారు. దేశవిభజన కార్యక్రమం ప్రకారం పాకిస్తాన్ కొన్యభాగానికి రావలసిన మందుగుండు సామగ్రిని భారతదేశం ఒప్పగించలేదన్నారు. వాస్తవం ఏమిటంటే మందుగుండు సామగ్రి పంపకం పైన ఒప్పందము కుదరలేదు. ఒప్పందం కుదరనంతవరకూ భారతదేశం ఒప్పగించవలసిన పనిలేదు. యుద్ధకాలంలో పాకిస్తాన్‌లో ఎంత సామగ్రి నిలవఉంచబడిందో సరైన లెక్కలు ఇవ్వనంతకాలం ఒప్పందం కుదరదు. ఈ వివరాల్ని కప్పిపుచ్చి భారతప్రభుత్వానికి విరుద్ధంగా ఈ రీతిగా ప్రచారంచేసినందువల్ల పూర్వ మైత్రీభావానికి కొంత భంగం కలగవచ్చునేమో కాని ప్రయోజనంమాత్రం ఏమీ ఉండదు.

పాకిస్తాన్ ప్రధాని పత్రికాసమావేశంలో ప్రశ్నించడానికి విలేఖరులికి ఆట్టే ప్రశ్నలే కనిపించలేదని వార్తాసంస్థ తెలిపింది. ఎందువల్లనంటే ఏ ప్రశ్నలువేసినా లియాఖత్ ఆలీ చెప్పబోయే సమాధానాలేవో విలేఖరులికి ముందే గ్రహించగలరని కూడా తెలిపింది. పండిట్ నెహ్రూ అమెరికాసంచారంలో అమెరికన్ పత్రికలు, వ్యాపారులు, పెట్టుబడిదారులు, రాజకీయనాయకులు నెహ్రూ ఏమిచెప్తాడోనని అతిఆత్రంతో కనిపెట్టిచూశారు. నెహ్రూ సమాధానాలు శాంతిప్రియులైన ప్రజాసామాన్యానికి అత్యంతానందం చేకూర్చినాయని రాజకీయనాయకులికీ, పెట్టుబడిదారులికీ బొత్తిగా అసంతృప్తి కలిగింది. కాని లియాఖత్ ఆలీసమాధానాలకోసం ఎవరూ కనిపెట్టి చూడవలసిన అగత్యం కలగలేదు.

ఇంత సులువుగా ఒకరినొకరు అర్థం చేసుకోగలగడం వారి అదృష్టమని చెప్పాలి. అలా అర్థం కావడానికి ఉభయులూ ఒకే తత్వం కలవారై ఉండాలి. లేదా, ఒకరికి మరొకరు మార్గదర్శకులై ఉండాలి. అంతర్జాతీయవ్యవహారాలలో తమకి సంబంధించని విషయాలన్నిటిలోనూ పాకిస్తాన్ దాదాపు భారతప్రభుత్వ విధానాన్నే అనుసరిస్తోంది. తమకి సంబంధించిన విషయాల్లో ఆంగ్లో-అమెరికన్ వర్గాలవారి నీతి లాభదాయకమని గ్రహించి నేర్పుగా అనుకరించగలుగుతోంది. తరుచు అమెరికన్ నాయకులు, అమెరికన్ పెట్టుబడిదారుల అధీనంలో ఉన్న పత్రికలు ఉప్పు అందివ్వడం, చడీచప్పుడూ కాకుండా పాకిస్తాన్ అందిపుచ్చుకోవడం జరుగుతూనే ఉంది. కాశ్మీర్ సమస్యసందర్భంలో బ్రిటన్ అమెరికాల సలహా పాకిస్తాన్‌కి అనేకమార్లు పరోక్షంగా లభించింది. పఠాన్ల స్వతంత్రరాజ్యస్థాపనోద్యమ సమస్యలో పాకిస్తాన్ నాయకులికి చేతగాలేకపోయిన ప్రచారాన్ని అమెరికన్ పత్రికలు ధారాళంగా చేసిపెడుతున్నాయి. పాకిస్తాన్ రూపాయిమారకం విలువనిగురించిగాని భారతదేశంలో వ్యాపారప్రతిష్టంభన

గురించిగాని ఆప్టే ప్రశ్నించవలసిన అగత్యం లేకపోయింది.

లియాఖత్ అలీఖాన్ తన ఉపన్యాసాల్లో మూడు ముఖ్యాంశాల్ని విపులీకరించాడు. 1. పాకిస్తాన్ దేశరక్షణ, 2. పాకిస్తాన్ రాజ్యాంగవిధానం 3. ఆర్థిక పునరుద్ధరణ సమస్య.

పాకిస్తాన్ దేశరక్షణసమస్యగురించి అసంగతమైన సూచనల్ని ప్రతిపాదించడంలో అవి ఆమోదింపబడాలనే ఉద్దేశ్యం ఉన్నట్లు కనిపించదు. అంతర్యం వేరే ఉండవచ్చును. కాశ్మీర్ సమస్య ఇంకా పరిష్కారం కాకముందే పాకిస్తాన్ దేశరక్షణకు బ్రిటన్ గాని అమెరికాగాని బాధ్యత వహించాలని వారు సూచనచేశారని ఒక వార్తాసంస్థ తెలిపింది. కొన్నిమాసాల క్రితమే బ్రిటన్ తదితర కామన్వెల్తుదేశాలు ఈ బాధ్యత వహించాలంటూ బ్రిటిష్‌ప్రభుత్వానికి ఒక సూచన చేశారట. రక్షణావసరం ఏమిటో స్పష్టపడలేదు.

పాకిస్తాన్‌కి ముప్పురావాలంటే మూడు విధానాలే ఉన్నాయి. 1. భారతదేశంతో శత్రుత్వంవల్ల. 2. ఆఫ్ఘనిస్తాన్‌వల్ల 3. రష్యావల్ల.

రష్యావల్ల ముప్పుసంభవిస్తే రక్షించడానికి కోరకుండానే బ్రిటన్ అమెరికాలు సిద్ధపడవచ్చును. కాని భారతదేశంవల్ల ముప్పుసంభవించినా ఆఫ్ఘనిస్తాన్‌వల్ల ముప్పుసంభవించినా బ్రిటన్ అమెరికాలు ప్రత్యక్షంగా జోక్యం కలగచేసుకోలేవు. బాధ్యత వహించగలరని చెప్పేముందు భారతదేశంపైనా, ఆఫ్ఘనిస్తాన్‌పైనా అనుమానం, ఆరోపణా జరగాలి. అనుమానించడానికి బ్రిటన్‌కిగాని మరదేశానికి హేతువు లేదు. కాబట్టి ఇటువంటి సూచనకి బ్రిటన్ సమ్మతించలేకపోయింది. భారతదేశంతోనూ ఆఫ్ఘనిస్తాన్‌తోనూ తగవులు తీరనిదే ఎటువంటి బాధ్యతనిగాని బ్రిటన్ వహించడం అసంభవం.

బ్రిటన్‌తో యత్నం ముగిసినతరవాత ఇప్పుడు అమెరికా బాధ్యత వహించాలని సూచించారట. కాని అమెరికాకూడా ఇది ఒప్పించడం అసంభవం, పరోక్షంగా ఎంత సహాయంచేసినా ప్రత్యక్షంగా అమెరికా భారతదేశంపట్ల అనుచితంగా ప్రవర్తించడానికి సాహసించలేదు.

వాస్తవానికి బ్రిటన్‌గాని, అమెరికాగాని అంగీకరింపగలరనే ఆశతో ఈ సూచనలు చెయ్యబడినాయంటే నమ్మడం కష్టం. పాకిస్తాన్‌కి ఈనాడు పెద్దసమస్య పఠాన్ల స్వాతంత్ర్యోద్యమం. ఇటీవల పఠాన్ల నివాసాలలో కమ్యూనిస్టులు రహస్యంగా ప్రవేశించి ఆయుధాలు సప్లై చేస్తున్నారని కొన్ని అమెరికన్‌పత్రికలు ప్రచారం చేస్తున్నాయి. పఠాన్ల స్వాతంత్ర్యోద్యమాన్ని పాకిస్తాన్‌ప్రభుత్వం అణచలేకపోతున్నదని ఆఫ్ఘన్‌పత్రికలు ప్రకటిస్తున్నాయి. ఇపీఫకీర్ ఆధ్వర్యంకింద సరిహద్దు ప్రాంతంలో పఠాన్లచే ఒకశాసనసభ ఎన్నుకోబడిందనీ, స్వతంత్రపఠాన్ ప్రభుత్వం స్థాపించబడిందనీ ఆపత్రికలు తెలుపుతున్నాయి. అయితే ఈ స్వతంత్రపఖ్తునిస్తాన్ ప్రభుత్వం ఆఫ్ఘనిస్తాన్ ప్రధాన నగరమైన కాబూల్‌లోనే ఉందనీ, (ఆజాద్ కాశ్మీర్ ప్రభుత్వం రావల్పిండిలో ఉన్నట్లు), ఆ ప్రభుత్వానికి సరిహద్దు పఠాన్ల మద్దతు లేనేలేదనీ పాకిస్తాన్ ప్రచారం చేస్తోంది. ఒకటి మాత్రం లోకానికి తెలుసును. పాకిస్తాన్ డ్యురండ్ లైన్‌వరకూ పరిపాలనాధికారాన్ని నెలకొల్పలేకపోతున్నది. నూరుమైళ్లవరకూ పాకిస్తాన్ పోలీసులుగాని సైనికులుగాని అడుగుపెట్టలేకుండా ఉన్నారు. ఈ ప్రాంతంలో పఠాన్లు స్వతంత్రంగా జీవిస్తున్నారు. పఖ్తునిస్తాన్‌ప్రభుత్వం అనేది అక్కడ స్థాపించబడిందో లేదో మాత్రం తెలియరావడంలేదు. అందువల్ల పాకిస్తాన్‌కి ముప్పు అనేది ఉంటే అది ఈ పఠాన్లవల్లనే సంభవించాలి. ఈ పఠాన్లను బ్రిటిష్ పాలకులే నిర్జించలేకపోయారు. ఇంక పాకిస్తాన్ అక్కడ అధికారాన్ని సుస్థిరపరుచుకోగలదనే విశ్వాసం కలగడంలేదు.

పఠాన్ల సమస్యను పరిష్కరించాలంటే పెద్దసైన్యాన్ని సంవత్సరంపొడుగునా సరిహద్దుప్రాంతంలో ఉంచక తప్పదు. దీనికి ఆర్థికబలం, ఆయుధసామగ్రి అవసరం. ఆఫ్ఘనిస్తాన్ సమ్మతి పొందనంతవరకూ ఇది కూడా సాధ్యపడదు. ఈ రెండువిధాలా సహాయం పడగలది అమెరికా ఒక్కటేనని లియాఖత్ అలీఖాన్‌కి తెలుసును. కాబట్టి మాట సహాయం ఆయుధసహాయం పొందడానికి ఈ సూచనలు చెయ్యబడుతున్నాయనుకోవచ్చును.

ఈ సందర్భంలో ఒక విషయాన్ని మరిచిపోరాదు. భారతప్రభుత్వంతో ఆర్థిక సమరం హద్దుమీరుతున్నరోజుల్లో యుద్ధానికి దిగరాదని ఇరుపక్షాలూ ఒప్పందం చేసుకోవాలని పండిట్ నెహ్రూ చేసిన సూచనను లియాఖత్ అలీ నిరాకరించారు. అప్పుడు పాకిస్తాన్ ప్రభుత్వ లక్ష్యాల్ని గురించి భారతదేశంలో అనేకఅనుమానాలు బయలుదేరాయి. పరిస్థితి విషమించి మహమ్మదీయులపైన ప్రతీకారం జరిగేవరకూ పాకిస్తాన్ నాయకులు సమాలోచనలకి దిగిరాలేదు. ఇండో-పాకిస్తాన్ ఒప్పందం అనంతరం ఏర్పడిన సద్భావంలో ఇప్పుడా విషయమై ఆలోచిస్తున్నారని లియాఖత్ అలీ కరాచీనుంచి బయలుదేరేముందు ప్రకటించారు. అయితే కాశ్మీర్ సమస్య పరిష్కారమైతేగాని ఇది సాధ్యపడదు. ఇది సాధ్యపడినప్పుడుగాని బ్రిటన్ అమెరికాలు పాకిస్తాన్ దేశసంరక్షణకు సహాయం, ఆయుధాల సప్లై ఆర్థికసహాయం ప్రత్యక్షంగా ఇవ్వలేవు.

లియాఖత్ అలీఖాన్ ప్రసంగంలో రెండోఅంశం పాకిస్తాన్ రాజ్యాంగ విధానం. అమెరికన్ కాంగ్రెస్‌లో ఉపన్యసిస్తూ పాకిస్తాన్ స్థాపనలో ముస్లింలీగ్ నాయకుల ఆశయాల్ని వివరించి, ఇస్లాం సిద్ధాంతాల కనుగుణమైన ఉత్తమప్రజాస్వామ్య సూత్రాలపైనే పాకిస్తాన్ రాజ్యాంగం నిర్మించబడుతున్నదని తెలిపారు.

“లక్షమంది మహమ్మదీయులు తమ మతాన్ని కోరినరీతిని అనుష్ఠించి, స్వేచ్ఛగా తమ ఇష్టంవచ్చినరీతిని భగవదారాధన చేసుకొనే అవకాశం ఇవ్వడానికిగాను పాకిస్తాన్ స్థాపించబడింది” అని లియాఖత్ అలీ చెప్పారు. అదే స్వాతంత్ర్యాన్ని అన్యమతాలవారికి కూడా ఇస్తున్నారన్నారు. హిందువుల అధికారప్రాబల్యం నుంచి ముక్తిపొందినందుకు భగవంతునికి కృతజ్ఞత తెలిపి, తమ దేశంలోని అల్పసంఖ్యాక వర్గాలవారికి మత స్వాతంత్ర్యం ఇస్తున్నట్లు చెప్పారు.

ఈ మాటల్లో భారతదేశంపైన ఆరోపణ ఇమిడిఉంది. కాని ఈ ఆరోపణే నిజమైతే భారతరిపబ్లిక్‌లో మిగిలి ఉన్న లక్షలాది మహమ్మదీయులకు పాకిస్తాన్ అన్యాయం చేసిందని చెప్పాలి. “దేశవిభజనవల్ల అల్పసంఖ్యాకవర్గాలుండవని మేము భావించలేదు. కాని విభజనవల్ల అల్పసంఖ్యాకవర్గ

సమస్య పరిష్కారసాధ్యమౌతున్నది. విభజనే జరక్కపోతే ఆసియారాజకీయవ్యవస్థను రక్షించడం అసంభవమయేదే" అన్నారు లియాఖత్ ఆలీ. అంటే దీని అర్థం ఒక్కటే స్ఫురిస్తున్నది. దేశవిభజనవల్ల ఏర్పడిన ఉభయదేశాల్లోనూ ఆయా అల్పసంఖ్యాకవర్గాల వారు అధికసంఖ్యాకవర్గలవారి ఆగ్రహానుగ్రహాలపైన ఆధారపడి ఉండాలనీ, ఒకదేశాన్ని మరొకదేశం శిక్షించాలంటే ఆ మరొకదేశం తమ అల్పసంఖ్యాకవర్గాల వారిపైన ప్రయోగించవచ్చుననీ లియాఖత్ ఆలీభావన కావచ్చును. తూర్పుబెంగాల్లో పరిస్థితి సరిగ్గా ఇదే సత్యాన్ని రుజావు చేస్తున్నది. ఉభయదేశాలమధ్యనూ వ్యాపారం స్తంభించిపోయినందువల్ల, తూర్పుబెంగాల్లో ఏర్పడిన దుస్థితికి అక్కడ హిందువుల్ని శిక్షించారు. ఇటువంటి సదాశయాలతో స్థాపించబడిన పాకిస్థాన్ రాజనీతి అంతర్జాతీయరంగంలో తిదనుగుణంగానే ఉంది. అందువల్లనే వారి ప్రజాస్వామ్యంలో ప్రజల పౌరస్వత్వహక్కులు, జాతీయభావం ఈ సంఘర్షణానే ప్రతిఫలిస్తూ ఉంటాయి. ఇస్లాంమతసిద్ధాంతాలనుమించిన ఉత్తమప్రజాస్వామ్యవిధానం లేనేలేదని లియాఖత్ ఆలీ చెప్పారు. ఈ ఇస్లాం రాజ్యాశయంలో "మతప్రధాన రాజ్యాంగవ్యవస్థ"కి (థియోక్రసీ) తావు లేదన్నారు. ఈ రెండూ పరస్పరవిరుద్ధాలు కాబట్టి పాకిస్థాన్ ప్రజలకీ నాయకులకీ ఏ విధానాన్ని అనుసరించాలో తెలియడం లేదు. తమ మతగురువులు చెప్పేదంతా ప్రజాస్వామ్యవిధానానికి అనుగుణమైనదేనని భావించి, బలాత్కారమతపరివర్తన కూడా సక్రమమైనదేనని ఆ ప్రకారం నిరుపేదలైన హరిజనులపైన తమ "ప్రజాస్వామ్య" సూత్రాల్ని ప్రయోగిస్తున్నారు. ఈపరిస్థితిలో "స్వాతంత్ర్యం అనేది ఎన్ని పునర్జన్మ లెత్తినప్పటికీ, దౌర్జన్యం, అపహాసం మొదలైనవి ఎప్పటికప్పుడు తలెత్తుతూనే ఉన్నాయి" అని లియాఖత్ ఆలీఖాన్ వాపోతే ప్రయోజనమేమీ ఉండదు. అసలు ఈ పరిస్థితికి పాకిస్థాన్ నాయకుల మనస్తత్వమేననే సత్యాన్ని వారు గ్రహించనంత వరకూ భీతి వారిని విడిచిపెట్టకుండా పీడిస్తుంది. ఈభీతి ఉన్నంతవరకూ శాంతి, ఆర్థికసముద్ధరణ అసంభవమే కాగలవు.



థేమ్సునదిమీద, బాలబాలికల బోట్ క్లబ్ —లండన్.

## హైనాన్ ద్వీపం *

హాంకాంగ్ దక్షిణాన కల హైనాన్ ద్వీపం చీనాకమ్యూనిస్టుల వశమయింది. ఈ ద్వీపంవిస్తీర్ణంలో ఫార్మోజాతో దాదాపు సమానంగా ఉంటుంది. ఆరుమాసాలుగా ఈ ద్వీపాన్ని చియాంగ్ కై షేక్ సైన్యాలు (40 వేలమంది) కాపాడుతూవచ్చారు. ఇక్కడ రెండు పెద్దవిమానాశ్రయాలూ ఒక పెద్ద ఓడరేవూ ఉన్నాయి. అపారమైన ఖనిజసంపద ఉంది. ద్వితీయప్రపంచసంగ్రామకాలంలో జపాన్ సైన్యాలు ఆక్రమించేరకూ ఈ సంపద వినియోగించబడలేదు. జపాన్ వారే ఓడరేవు నిర్మించారు. గనులు తవ్వారు. చియాంగ్ కై షేక్ ప్రభుత్వం ఫార్మోజాకు తరలిపోయినప్పుడు హైనాన్ ఫార్మోజాలు మాత్రమే వారి అధీనంలో మిగిలాయి. హైనాన్ ద్వీపంలో నౌకాబలాన్ని నిలుపరించి బ్రిటిష్ అమెరికన్ నౌకల్ని కమ్యూనిస్టు చీనారేవులకు పోకుండా అటకాయిస్తూ వచ్చాయి.

కమ్యూనిస్టులు చిన్న బోట్లలో రహస్యంగా ద్వీపంచేరి అక్కడ అయిదువేలమంది గొరిల్లాలని చేర్చారు. క్రమంగా హైనాన్ రక్షకులు గొరిల్లాల చర్యలనీ, కమ్యూనిస్టుల దాడుల్ని తట్టుకోలేక ఒక మాసంముందే ఆయుధసామగ్రిలో చాలవరకు ఫార్మోజా చేర్చివేశారు. పైన దాడి చేసివచ్చిన పదివేలమంది కమ్యూనిస్టులతో గొరిల్లాలు కలియగానే, పదివేలమంది జాతీయసైనికుల్ని మాత్రం ద్వీపంలో విడిచిపెట్టి జాతీయప్రభుత్వాధికారులు నౌకల్లో ఫార్మోజాద్వీపానికి మిగతాసైన్యంతో కలిసి పారిపోయారు. హైనాన్ద్వీపంలో రవంతైనా యుద్ధం జరక్కుండా కమ్యూనిస్టుల వశమైపోయింది.

[సూర్యనారాయణ]

# మనదేశం

భారతదేశానికి రిపబ్లిక్ వ్యవస్థ ప్రాప్తించినప్పుడు జనవరిలోనే జరుగవలసిన కేంద్రమంత్రివర్గపునర్నిర్మాణం బడ్జెట్ సమావేశం, ఇండో-పాకిస్తాన్ ఒప్పందాలు పూర్తికావడంతో ఇప్పటికి సాధ్యపడింది. కాని ఇప్పటికైనా పునర్నిర్మాణం పూర్తి కాలేదు. జూన్‌లోగా పూర్తికావచ్చును.

ఇప్పటికి జరిగిన చిన్నమార్పులు అనుకున్నవే. రాజీనామా నిచ్చిన డా॥ ముఖర్జి నియోగీలకు బదులుగా ఇద్దరు కొత్త మంత్రుల్ని ఒక కొత్త ఉపమంత్రిని మాత్రమే చేర్చుకున్నారు. వారు శ్రీ కె. యం. మున్షి, శ్రీ హరికృష్ణ మెహతాబ్ శ్రీ సి. సి. బిశ్వాస్‌గార్లు. మున్షీ 1936 బొంబాయిమంత్రివర్గంలో అంతరంగిక శాఖామంత్రిగానూ, 1948 లో హైదరాబాద్ భారతప్రభుత్వపు ఏజంట్ జనరల్‌గానూ పనిచేశారు. శ్రీ హరికృష్ణ మెహతాబ్ ఒరిస్సా ముఖ్యమంత్రిగా పరిపాలనా దక్షులని పేరుపొందారు. శ్రీ బిశ్వాస్‌గారు కలకత్తా విశ్వవిద్యాలయఉపాధ్యక్షులుగా ఉన్నారు. కలకత్తా కార్పొరేషన్ వ్యవహారాలను పరిశీలించి నిష్పక్షపాతవిమర్శకి ఖ్యాతి గడించారు. కాంగ్రెస్ అభిమానులు లిబరల్‌నాయకులైన స్వతంత్రాభిప్రాయాలు గలవారు.

వీరుకాక ఆఖరు గవర్నర్ జనరల్ శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారిగారిని కూడా మంత్రివర్గంలో చేరవలసిందని ఆహ్వానించారు. వారి సమ్మతి ఇంకా ప్రకటించబడవలసిఉంది. మేమాసాంతంలో ఆర్థికమంత్రి డా॥ జాన్‌మత్తయ్ రాజీనామా నివ్వడానికి నిశ్చయించారు. దీనికి రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ సమ్మతించారు. అన్యులు ఏర్పాటయ్యేవరకూ పనిచేసి తరువాత రాజీనామా నివ్వాలని ఆహారశాఖామంత్రి శ్రీ జయరాందాస్ దౌలత్‌రాం, శరణార్థులపునరావాసశాఖా ఉపమంత్రి శ్రీ మోహన్‌లాల్ శాక్సేనా గార్లు నిశ్చయించారు. వీరి స్థానే ఎవర్ని నియమించాలో ఇంకా నిర్ధారణ కాలేదు. ఉత్తరప్రదేశముఖ్యమంత్రి పండిట్ గోవిందవల్లభపంత్, అస్సాం గవర్నరు శ్రీ ప్రకాశ్‌గార్లను మంత్రులుగాను శ్రీ అజిత్‌ప్రసాద్‌జైన్‌గారిని ఉపమంత్రిగానూ నియమించగలరని వార్తలు వెలువడుచున్నాయి.

ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ విదేశాంగశాఖను శ్రీ రాజగోపాలాచారిగారికి ఒప్పగించగలరనీ, డా॥ మత్తయ్‌గారి స్థానే గోవిందవల్లభపంత్‌గారిని ఆర్థికమంత్రిగానూ, మున్షీగారిని ఆహారవ్యవసాయశాఖల మంత్రిగాను, శ్రీ హరికృష్ణ మెహతాబ్‌గారిని వాణిజ్యశాఖామంత్రిగానూ నియమించగలరనుకుంటున్నారు. శ్రీ శ్రీప్రకాశ్‌గారు పరిశ్రమలశాఖకు నియోగింపబడవచ్చును. కొత్తవారొచ్చి ఆయాశాఖల నిర్వహణ ప్రారంభించేవరకూ పాతమంత్రులు పాతశాఖలనే నిర్వహిస్తారు. ఖాళీపడిన వాణిజ్యశాఖ పరిశ్రమలశాఖ ప్రధాని నెహ్రూనిర్వహణలో ఉంటాయి.

ఇప్పటికి ప్రకటించబడిన మంత్రివర్గ జాబితా: 1. పండిట్ నెహ్రూ (ప్రధానమంత్రి, విదేశాంగశాఖ), 2. సర్దార్ పటేల్ (ఉపప్రధాని, అంతరంగిక, సంస్థానశాఖలు), 3. మౌలానా అబుల్ కలాం ఆజాద్ (విద్యాశాఖ) 4. డా॥ జాన్‌మత్తయ్ (ఆర్థికశాఖ) 5. శ్రీ జగజీవనరామ్ (కార్మికశాఖ) 6. రఫీఅహ్మద్ కిద్వాయ్ (తంతి తపాలాశాఖ) 7. సర్దార్ బల్దేవ సింగ్ (దేశరక్షణశాఖ) 8. శ్రీమతి అమృత కౌర్ (ఆరోగ్యశాఖ) 9. డా॥ బి. యం. అంబేద్కర్ (న్యాయశాఖ) 10. శ్రీ యన్. వి. గాడ్గిల్ (విద్యుచ్ఛక్తి, గనులు వగైరా) 11. శ్రీ యన్. గోపాలస్వామి అయ్యంగార్ (రైల్వే రవాణా) 12. శ్రీ జైరాందాస్‌దౌలత్‌రామ్ (ఆహారవ్యవసాయశాఖలు) 13. శ్రీ హరికృష్ణ మెహతాబ్. 14. శ్రీ కె. యం. మున్షి. మొత్తం 14 మంది.

స్టేట్‌మంత్రులు అయిదుగురు 1. శ్రీ సి. సి. బిశ్వాస్. 2. శ్రీ మోహన్‌లాల్ శాక్సేనా (శరణార్థులశాఖ) 3. శ్రీ కె. దింతానం (రైల్వే) 4. శ్రీ ఆర్. ఆర్. సవాకర్ (ప్రచారశాఖ) 5. శ్రీ సత్యనారాయణసిన్హా (పార్లమెంటరీ వ్యవహారాలు.

డిప్యూటీ మంత్రులు ఇద్దరు. 1. శ్రీ ఖుర్షీద్‌లాల్ (తంతి, తపాలా శాఖ) 2. డా॥ బి. వి. కేస్కర్ (విదేశాంగశాఖ).

వీరిలో శ్రీ బిశ్వాస్‌గారిని ఇండో-పాక్ ఒప్పందంప్రకారం పశ్చిమ బెంగాల్లో కేంద్రప్రభుత్వంతరఫున మంత్రిగా నియమించబడతారు.

పునర్నిర్మించబడిన మంత్రివర్గం శనివారం ఉదయం పదకొండుగంటలకు రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్‌గారి సమక్షంలో నూతనప్రమాణస్వీకారం చేశారు. ఈ మంత్రివర్గం మొత్తం 14 మందిలో నలుగురే కాంగ్రెసేతరు లున్నారు. ముందుముందు జరగబోయె మార్పుల్లో ఈ ముగ్గురిలోనూ ఒకరు నిష్క్రమిస్తారు. ఇంక నియమించబడేవారందరూ కాంగ్రెస్‌కు చెందినవారే కాబట్టి, పార్లమెంట్ లోని కాంగ్రెస్‌సభ్యుల కోరికప్రకారం మంత్రివర్గంలో క్రమక్రమంగా కాంగ్రెసేతరుల ప్రాబల్యం తగ్గతోంది. పార్లమెంట్ కాంగ్రెస్‌సభ్యుల కోరిక ఉచితమైనా అనుచితమైనా ఒకటి మాత్రంసంతోషదాయకం. ప్రజాప్రతినిధుల అభిప్రాయాలపట్ల అధిక శ్రద్ధవహించాలని ప్రభుత్వనాయకులు క్రమక్రమంగా మేలుకొంటున్నారు. వాగ్వివాదాలో సంభవించినప్పుడు ప్రజల కోరికలను మన్నించకుండా ఏ ప్రభుత్వమూ అట్టేకాలం నిలవలేదు. కనీసం ఎన్నికలు సమీపించే కాలంలోనైనా నాయకుల దృష్టి ఇటు మళ్లక తప్పదు కాని ఇప్పుడైనా మంత్రివర్గపునర్నిర్మాణంలో పార్లమెంట్ సభ్యుల ఒక్క కోరిక మాత్రమే మన్నించబడింది కాని పునర్నిర్మాణోద్దేశం సఫలం కాలేదు. ఈ మార్పులవల్ల వాస్తవానికి ఏప్రాంతంలోనూ ఏ వర్గానికీ తృప్తికలగలేదని చెప్పాలి. రిప

(39-వ పేజీ చూడుడు)

నవల:



శ్రీ నోరి నరసింహశాస్త్రి

౨౧

ఆనాడు క్రీడాశైలశిఖరమున ఓరుగల్లుకోటశిలాప్రాకారనిర్మాణ విషయమును ప్రసంగించుటకయి రుద్రమదేవితో మాటాడుచున్న యన్నమంత్రిని సమీపమున నుండి చూచినదాది, ఆతని రూపము రుయ్యమచిత్తమున హత్తుకొనిపోయెను. అతడామెపై ముందుగా నాదరపూర్వక మగు దృష్టి యేమాత్రము బరపియుండలేదు. పైగా ముందు ఒకానొక తీవ్రమైన దృష్టియే పరపియుండెను.

"ఇంకను ఇక్కడనే ఉన్నావేమి? వెళ్లిపోతే దేమి?" అను నర్థముతో నొక పరిచారికపైపు పరపు దృష్టియే యది! కాని యాతడు పరపిన యా తీవ్రదృష్టియో, చిత్రమేమో కాని, రుయ్యమ హృదయములో నవమల్లికాకోరకము బలవంతముగా ప్రవేశించినట్లు ప్రవేశించి కలవరపెట్టినది. ఆపైనా యువతి కచ్చుట నిలుచుటే కొంతవడి కష్టమయినది. కాని ప్రయత్నపూర్వకముగా నెట్లో నిలువరించుకొనగలిగినది. అన్నమంత్రి శ్యామాయితదేహమును ఆయనగారి కన్నులలోని యపూర్వకాంతియు మాటిమాటి కానాడు రుయ్యమ దృష్టిని బలముగా నాకర్షించెను.

ఆనాడే అన్నమంత్రీశ్వరుని తప్పనిసరియై నిర్బంధములో నుంచుటకు రుద్రమ యాజ్ఞలిచ్చుచున్న సందర్భమున రుయ్యమ నిర్ఘాంతపడిపోయెను. సుఖస్వప్నమునుండి బలవంతముగా మేలుకొనినట్లైయైనది. తుదకుతుదకు అన్నమంత్రికిని రుద్రమకును జరుగుచున్న సంభాషణమే ఆమె వినజాలకపోయినది. ఆమాటల ధ్వనియు నామెచెవుల బడినట్లే లేదు. ఎదుట నున్న యా యన్నమంత్రీశ్వరుడు ఒక గంధర్వమూర్తిగానే ఆమె కప్పుడు భాసించెను.

"ఇతడు బ్రహ్మదేవుడు. ఇతడే హరి. ఇతడే హరుడు! ఇతడే అగ్ని. ఇతడే సూర్యుడు—ఇతడే సర్వదేవతామూర్తి! పరదైవము!"

ఇట్లనుచు రుయ్యమ తలంచుచునే యుండెను. అన్నమంత్రి యటనుండి నిర్బంధమునకు తీసికొనిపోబడెను.

అంతట రుద్రమ రాజమందిరమునకు గదలినది. రుయ్యమ చిత్తరువులోని బొమ్మవలెనే కదలలేకపోయెను. రుద్రమయు తన వెంట నామెను రమ్మనకుండనే తన మనస్సులోని యాందోళనతో తాను కదలిపోయినది.

ఆనాటినుండి రుయ్యమమనస్సు మనస్సులో లేదు. తన మనస్సులోని బాధ ఎవ్వరితో చెప్పుకొనగలదు? పురుషమూర్తి యందు పురుషభావ మీనాడే తనకు మొదటిపర్యాయ ముదయించినది. అన్నమంత్రి దూరమైనదాది యాతనిరూప మామెకు నిత్యసన్నిహిత మయ్యెను.

ఆ మూర్తి తనయెదుట కూర్చుండి తన్ను కొంతవడి తీవ్రముగా చూచుచున్నట్లుండును. కొంతవడి యాశ్చర్యముతో కొంత చులకనగా చూచినట్లుండును. ఆ మూర్తి యెట్లు చూచినట్లున్నను, 'నీవు యువతివి! నీవు చిన్నదానవు!' అని మాటిమాటికి నిష్కర్ష చేసి చెప్పుచున్నట్లే యుండును.

రాత్రింబవళ్లు నన్నమంత్రిధీరమూర్తి యామెచిత్తమున హత్తుకొని విడువదయ్యెను. అదియు నామూర్తిని తన మనస్సున బారకుండ నుంచవలె నని యెట్టి ప్రయత్నమును జేయదు. ఆ మూర్తినే రుయ్యమ తన సర్వాంగముతో సర్వాత్మనా పొదివి ధ్యానింపసాగినది.

"అట్టి పురుషమూర్తిని మా యమ్మయే నిర్బంధమున కంపినది. అమ్మ నేమనగలను? ఆమె కెంత బాధకలిగినదో! నాకుగూడ కలిగెడి బాధ యామెకు తెలియజేసి అమ్మను మరింత వ్యథపెట్టరాదు. మరి ఎవరితో నాబాధ చెప్పికొందును?"

ఇట్లు రెన్నాళ్లు గడచిపోయినవి. రుయ్యమ తన మందిరమున నేకాంతముగా నొక గదిలో కూర్చుండి ఏకశిలపై నానాడు శిలాప్రాకారనిర్మాణాదుల విషయమున జరిగిన చర్చలనే మననము చేయుచు మధ్యమధ్య అన్నమంత్రి యన్నమాటలు జ్ఞాపకము తెచ్చుకొనుచుండెను. ఆ సమయమున ఒక ప్రక్కనుండి శ్రావ్యమై కొందరు కంఠములు కలిపి వేదమంత్రములు పఠించుచున్న శబ్దము వినవైనది.

ఆ నాదము ఆమె కొక అనిర్వాచ్యమగు మనశ్శాంతిని గలిగింపగా దానియందే తన చిత్తము లీనమొనర్చి వినుచున్నది. సంస్కృత కావ్యభాష యామెకు బాగుగా నలవడినది కాని వేదభాష రాదు. ఆ మంత్రము లాకారణమున నర్థమైనట్లుండియు నామెకు సరిగా నర్థమగుట లేదు. ఐనను అర్థమైనభాగమును కానిభాగమునుగూడ ఆమెకు సమానముగనే హృదయావేగమును శాంతింపజేయుచుండెను.

కొంతవడికి వేదపాఠ మాగిపోయినది. రుయ్యమగుండెలే యాకస్మికముగా నాగినట్లయ్యెను!

అంతలో వేదమంత్రములే విద్యార్థికి పాఠము చెప్పుచున్న శబ్దమాపైపునుండియే వచ్చుచుండెను. అధ్యాపకుడు మంత్రములో

కొన్ని పదములు కలిపి యొకసారి పలుకును. అది వెంటనే విద్యార్థి రెండుమారు లుచ్చరించును. పిమ్మట గురువు పైభాగ మందుకొని ఒకమా రనును. అదియే విద్యార్థి రెండుమారు లనును. అట్లు మంత్రములో కొంతభాగ మైనపిమ్మట నదియంతయు కలిపి అధ్యాపకు డొకసారి చెప్పును. అదియంతయు కలిపి విద్యార్థి రెండుమారులు చెప్పును. ఆపిమ్మట మరల పైపదములు కొన్ని కలిపి గురువు పలుకుట, విద్యార్థి యవి రెండుమారులు తిరిగి పలుకుట—ఇదేవిధముగా పాఠము సాగిపోవుచుండెను. ఎవరో వేదవిద్యార్థి పాఠము చెప్పుకొనుచున్నాడని యాదరభావముతో రుయ్యమ యాపాఠ మాలకించుచుండెను.

వేదవిద్యార్థుల కంఠములలో సామాన్యముగా నొక యవ్యక్తమగు మాధుర్య ముండును. గురువుకంఠములో గాంభీర్య ముండును. అది వయస్సులోని భేదము. బాలురయు వయస్సుముదురని యువకులయు కంఠములు యువతుల కంఠములవలెనే హెచ్చుస్థాయిలో సులభముగా ప్రసరించును. అట్లు ప్రసరించు విద్యార్థికంఠమువలె లే దీచెప్పుకొను విద్యార్థికంఠము! స్వాధ్యాయము చెప్పుచున్న గురుని కంఠమువలెనే యా విద్యార్థికంఠమును మంద్రగంభీరముగా నుండి నిండుతనము గలిగి, పరిణతు డగువాని కంఠధ్వనివలెనే వినవచ్చుచుండెను. సింహగర్జనము రెండు గిరిగహ్వరములనుండి మారుమ్రోగుచున్నట్లే ఉదాత్తతరమై యీ విద్యార్థికంఠము వినవచ్చుచున్నది.

అందుకు రుయ్యమ యాశ్చర్యపడుచుండునంతలోననె ఆ విద్యార్థికంఠము తాను మున్నెన్నడో విన్నదానివలె తోచెను. ఎక్కడ విన్నది? ఎక్కడ విన్నది? ఎప్పుడు?—ఆ పరమేశ్వర మూర్తిది కాదా ఇది?

అంతవరకు తాను విశ్రమించియుండిన యాసనమునుండి రుయ్యమ చివాలున లేచి గవాక్షమునొద్దకు బోయి యా స్వరము వచ్చుచున్న దిక్కుకు దృష్టి సారించెను. ఆమెకన్నులే పండినవి. ఆమెవీనులే ధన్య మైనవి.

అటు సమీపమున నున్న యుద్యానమున నొక మఱ్ఱిచెట్టు నీడను అధ్యాపకుడు తూర్పుముఖముగా కూర్చుండి వేదపాఠము చెప్పుచుండెను. ఆ విద్యార్థి వినీతుడై ఉత్తరాభిముఖముగా బాసిపెట్టు వేసికొని కూర్చుండి రెండుచేతులు కట్టుకొని తనముందు తదేకనిష్ఠుడై చూచుచు దేహము నిశ్చలముగా నుంచుకొని పాఠము సంత చెప్పుకొనుచుండెను. ఆ చెప్పుకొనుచున్న విద్యార్థి నిజముగా నన్నమంత్రీశ్వరుడే! అన్నమంత్రీశ్వరుడే! అతనికి గాక లోకమున మరొకరికి అంత తీవి యుండునా? స్పష్టముగా నా మహానుభావుని కంఠమే యది! అనుమానము లేదు. అతడానాడు వేదవేదాంతచింతనమునకు నలుగురు వేదవిదులను పంపుమని యర్థించియుండెను గదా! ఇట్టి మహానుభావులు కారణజన్ములు! వారికి నిర్బంధ ముండునా? శ్రీదేవీభాగవతమున జీవన్ముక్తుడగు జనకమహారాజు శ్రీశుకుల కేమని నివేదించినాడు?

‘బంధనము బంధన మటందు బ్రాహ్మణేంద్ర,
యాత్మ బంధింప దరమె నిరంజనంబు?’

అన్నమంత్రి సరిగా రుయ్యమ కెదురుగనే తిరిగి కూర్చుండియుండెను. ఆ గవాక్షమునొద్ద నిలుచున్న రుయ్యమ్మ కదలలేకపోయినది. తదేకదృష్టితో నది యన్నమంత్రివంకనే చూడసాగినది.

రుయ్యమ్మ యాలోచించుకొనెను. తన హృదయములో పదిలము చేసికొన్న అన్నమంత్రీశ్వరుని మూర్తి యుజ్జ్వలముగా నున్నదా? ఆతని యీ ప్రత్యక్షమూర్తి యుజ్జ్వలముగా నున్నదా? సామాన్యముగా ప్రేమచే భక్తిచే మనము మన ప్రియులయు పూజ్యులయు మూర్తులు మనస్సులలో కల్పించుకొనునవి అట్టివారి ప్రత్యక్షమూర్తులకంటె నుత్తమములుగా నుండును. కాని రుయ్యమ పోల్చుకొనగా, తాను మనస్సులో కల్పించుకొనిన యా మంత్రిమూర్తి కంటె ప్రత్యక్షమైన యాయనదివ్యమూర్తి ఉజ్జ్వలతరముగా నున్నట్లున్నది! ఈ మహానుభావుడు మహామంత్రిపదవినుండి తొలగింపబడెను. పూజ్యురాలగు గౌరమ్మతల్లినుండి వేరుచేయబడినాడు. భక్తురాండ్రగు సతు లిద్దరకు దూరమయినాడు. ప్రాణపదయగు కుమారి బాలనుగూడ చూచుటలే దిప్పుడు. ఇట్లిక్కడ నిర్బంధములో నున్నను ఈతని నిర్లిప్తభావ మేమి? రాజ్యతంత్రము నిర్వహించునెడ నీతడెంత శ్రద్ధ చూపుచుండెనో, అట్టి శ్రద్ధయే యీతడిప్పుడు వేదాధ్యయనము చేయుటలో చూపుచున్నాడు. శ్రీకృష్ణుడు సాందీపనియొద్ద నిట్లే వేద మభ్యసించి యుండెనా?

ఆతనివంక చూచుచున్నకొలదియు నామె తనచూపు నట నుండి మరల్పలేకపోయినది. తన కాతడెదురుగనే కూర్చుండియున్నాడు. తాను నిలిచియున్న గవాక్షము విశాలమైనది. అయినను అతడామెవంక చూడనేలేదు. అంతఃపురమువైపుకు తలయెత్తి చూచుట యనుచితము. అందుచే నాతడటువంక చూడడు. పాఠమైనపిమ్మటగూడ నాతడామె యున్నవైపు చూడనేలేదు.

ఆనాటినుండియు నప్రయత్నముగా రుయ్యమ యా గవాక్షమునొద్దకు బోయి అన్నమంత్రిచర్యలు తరచుగా విలోకింప సాగినది. ఏపని చేయుచున్నను అన్నమంత్రి తన యుదాత్తభంగి విడనాడడు. వేదవిదు లగు నా నలువురు బ్రాహ్మణులతోడనే యాతడు రాత్రిందివము కాలక్షేపము చేయును. కొంతతడవు వేదపాఠము చెప్పుకొని పిమ్మట నాతడు వేదాంతపాఠమున కుపక్రమించును. వేదపాఠము చెప్పు నధ్యాపకు డొకడు, వేదాంతము చెప్పునది వేరొకరు. మధ్యాహ్నభోజన మైనంతట కొంచెముతడ వాతడు విశ్రమించి వేదశ్రవణము చేయుచు వేదమంత్రార్థము వినును. ఇది చెప్పునది మూడవయధ్యాపకుడు. నాల్గవ యధ్యాపకుడు శ్రౌతప్రయోగము చెప్పుచు దర్శపౌర్ణమాస్యలు ప్రారంభించెను. మేధావి యగు నా మంత్రీశ్వరున కొక్కమారు చెప్పినది మరచుట యున్నట్లు లేదు. అధ్యాపకులతో లేని సమయములందెల్ల నాతడు చెప్పుకొన్న వేదపాఠము వల్లెవేయుచునో వేదాంతపాఠము చింతన చేయుచునో గడపుచుండెను. ఆ నలుగు రధ్యాపకులకును వేదవేదాంతవిద్యాసాధనతప్ప వేరుచింతలు లేనట్లే యుండెను. చూచుచున్న రుయ్యమ్మకు అక్కడ ఋష్యాశ్రమము వెలసినదా యనిపించుచుండెను.

మధ్యమధ్య వచ్చు ననధ్యయనదినములలో మాత్రము కొంచెము భేదము రుయ్యమదృష్టిని పడకపోలేదు. ఆ దినముల వేదవేదాంతపాఠములు గాని దర్శపౌర్ణమాస్యలపాఠముగాని యుండదు. కొంతసేపు తక్కినరోజులలో చెప్పుకొనిన పాఠములు వల్లెవేసి చింతన చేయును. కాని యాదినములలో నాతనికి కొంత వ్యవధి చిక్కును. అట్టి సమయముల నాతడు తరచుగా నా చిన్నవనములో నిటు నటు పచారుచేయుచు ప్రొద్దుపుచ్చును. మధ్యమధ్య నతడేదో దీర్ఘ

ముగా నాలోచించుచున్నాడా యనిపించును. పాపము, పార్వతియు లకుమాంబయు నాతని మనస్సున భారిరి యని రుయ్యమ తలంచును. కాక, బాలయే తలపునకు వచ్చినదా యని యనుమానించును. కాని యాతడుమాత్రము అంతఃపురమువంక తలయెత్తి చూడడు.

కాని యటువైపు తలయెత్తి చూడదగదని యెంత యనుకొన్నను, తనవైపే గౌరవాదరములతో నొక సుకుమారకన్యక నిరంతరము చూచుచున్నచో, నది యాతని కెన్నటికిని తెలియకుండుట సాధ్యపడునా? రుయ్యమ్మ చూచుచుండకపోయినను రుయ్యమ్మ యాత్మయంతయు నన్నమంత్రిపైననే వ్రాలియుండ నాతని కది తెలియకుండు టెట్లు? భావములుకూడ స్పర్శకంటె నెక్కువ గట్టిగా స్పష్టముగా నవతలివారిపైకి ప్రసరించి తాకి యుద్బుద్ధుల నొనర్చును. చేతులతో చేయు స్పర్శకంటెను భావస్పర్శయే తీవ్రమైనది. గాఢమైనది, తీక్ష్ణమైనది. స్థూలశరీరమునకుకంటె సూక్ష్మశరీరమునకు వ్యాప్తి యెక్కువగదా! సూక్ష్మమునకుకంటె కారణశరీరమునకు వ్యాప్తి విస్తారము; అది అనంతమే!

రుయ్యమ్మస్థూలశరీరము దాని గదిలోని కిటికీవద్దనే నిలుచుండియున్నది. మరి దాని సూక్ష్మశరీరమే పోయెనో, కారణశరీరమే పోయెనోగాని, యది పరధ్యానముగా నున్న యన్నమంత్రీశ్వరుని గాఢముగా తట్టినట్లు స్పృశించినది. అతడప్రయత్నముగా తలయెత్తినాడు. రుయ్యమ్మ కనబడినది.

రుయ్యమ్మకు ఒక్కసారిగా సిగ్గువచ్చినది; భయము వేసినది. కాని చింతాపరుడైయున్నట్లున్న యన్నమంత్రీశ్వరుని దృష్టిపథములోనుండి యావలకు పోలేకపోయినది. అతని దృష్టి దాని రెండు కాళ్లను కదలకుండ బంధించినట్లయ్యెను. ఆమె కేమి చేయను తోపలేదు; రెండుచేతులు భక్తిభావముతో జోడించి యాతనికి నమస్కరించినది. ఆమె కన్నీళ్లే ఏకధారగా కార్చినది.

అన్నమంత్రి యామెనమస్కృతిని చూచి తన దక్షిణహస్తమెత్తి యాశీర్వదించెను. పిమ్మట, దానికన్నీళ్లాతని కంత దూరమునుండి కూడ కనబడినవేమో, అతడు తలవంచుకొని మరల చింతాపరుడయ్యెను. కొంతసేపటి కాతడు అవలికే పోయెను.

రుయ్యమ్మ తన ధైర్యమునకు తానే యాశ్చర్యపడెను. కాని తాను అన్నమంత్రికి నమస్కరించినందుకు తా నొక తప్పు చేసినానను భావము దానికి కలుగలేదు. తా నందుచే ధన్యనైతి ననియే యది తలంచెను. తాను చేసినదానిలో ననుచిత మేమున్నది? పూజ్యు డగు మంత్రీశ్వరు డతడు. తనకు పూర్వము ఏకశిలపై మంత్రాలోచనలో కొంత పరిచితుడైనవాడు. అట్టివాడు కనబడినపుడది నమస్కరింపక యెట్లుండగలదు? అనుచితమేమియు లేదు. పైగా నమస్కరింపకుండుట యనుచితము! మరి తాను కన్నీళ్లు కార్చనే? అవును. అంతటివాడు నిర్బంధములో నుండ చూచిన నెవరికి కన్నీరు రాదు?

ఆనాడాతడు తనవంక జూచెను. తన్ను ఆదరముతో దీవించెను. కాని మరునాడు మరల నట్లే యాతడు తనవంక కటాక్షించునా? రుయ్యమ గవాక్షమువెంటనుండి నిరీక్షించెను. మరల తన కెదురుగానే కూర్చుండి యన్నమంత్రి యధ్యయనము చేయుచుండెను. ఆ యోగీశ్వరుని కానాడు రుయ్యమ్మ కనబడలేదు. మరునాడును నట్లే యైనది. ఆ మరునాడును నట్లే యైనది. తర్వాతినాడును అంతే!

మరల ననధ్యయనము వచ్చిననాడుగాని రుయ్యమ్మకు మరల నన్నమంత్రీశ్వరుని యాశీర్వచనభాగ్యము లభింపలేదు. ఈమా రనధ్యయనములు మూడు! చతుర్దశి, అమావాస్య, పాడ్యమి. అనధ్యయనములు మూడైనను ఒక్కనాడే ఆమె సౌభాగ్యము! ఆ మహానుభావునికి లోల్యము లేదు. తన భక్తికి తుష్టుడై తన్ను అప్పుడప్పుడు అనుగ్రహించుచున్నాడు! ఇట్లు పక్షములు గడచిపోయినవి!

ఈనాడు అనధ్యయనము! ఈ ఉదయమున నూతనగా అన్నమంత్రీశ్వరుడు ఆ వనములో సంచరించుచున్నాడు. మౌనముగానే ఆతడీనాడు చింతాక్రాంతహృదయుడై భారముతో నున్నాడని రుయ్యమకు తోచినది. వెంటనే వీణ తీసికొన్నది అప్రయత్నముగా నది విక్రమోర్వశీయనాటకమునందలి పురూరవోక్తశ్లోకము గానము చేసినది.

"దోఇఅ గహిఓ అహిఅం దుహిఓ,
విరహాణుగఓ పరిమంథరఓ
గిరికాణణఏ కుసుముజ్జలఏ
గఅ జూహవఈ ఉఅఝీణగఈ"

అపిమ్మట దీనముగా మరియు కొన్నిగీతములు పాడెను. తుదకు—

'త్వం జీవితం త్వమసి మే హృదయం ద్వితీయమ్
త్వం కౌముదీ నయనయో రమృతం త్వదంగే—'

ఆ రెండుపాదములే మరలమరల పాడుచు నది వీణవాయించుచుండెను. కిటికీ తెరచియే యున్నది. అవల వనములో అన్నమంత్రి దీర్ఘాలోచనతో బంధితుడైన సింహమువలెనే, వడివడి నిటునటు తిరుగుచుండెను.

ఆ గదితలుపు రుయ్యమ్మ బంధించియుంచలేదు. ఆ గదిలోని కెవ్వరును దాని యనుజ్ఞ లేనిది రారు. అయినను తానేమి తప్పు చేయుచున్నది, తలుపు బంధించుటకు? అందుచే నా గవాక్షము నొద్ద నది నిలుచుండు వేళలకూడ ముందుగా నా గదితలుపు గడియ వేయు నభ్యాసము లేదు. ఈనాడును తలుపు దగ్గరకు లాగియే యుండెను గాని, గడియ వేసియుండలేదు.

అది యట్లెంతసేపు పాడినదో! దాని కన్నులవెంట నేకధారగా నీరు కారుచున్నది! కంఠము గద్గదమగుచున్నది! నోట పాట యాడుటలేదు. నాలుక తిరుగక తడబడుచున్నది. తొడపై నుండి వీణ నేలకు జారిపోవుచున్నది.

* * * *

ఎప్పుడు రుద్రమ తలుపు త్రోసికొని వచ్చినదో గూఢముగా రుయ్యమ గమనింపలేదు. రుద్రమకూడ ముందు తెలుపనిదె యాలోపలి కెన్నడు రాదు. సరిగా రుయ్యమ్మనోట పాట యాగిపోవుచుండు సమయముననే రుద్రమ్మ యా పిల్లదానిని తన యొడిలోనికి చేర్చుకొని యాదరముతో నాలింగనము చేసికొనెను.

రుయ్యమ్మ తాళలేక యప్రయత్నముగా వెక్కివెక్కి యేడువసాగెను.

(31 వ పేజీ చూడుడు)

ప్రకాశం ప్రభుత్వం పడిపోయినప్పుడు, కొంతమంది విమర్శకులు అదేదో కాంగ్రెస్ ప్రహకల్లోలం అని చూస్తూ ఊర్కోలేదు. గాన్ని సిద్ధాంతాలను చాదస్తంగా అమలు జరుపుతున్నందువల్లనే ప్రకాశం ప్రభుత్వం కూలిపోయిందన్నారు. ఆ ప్రకాశం చాదస్తాల్లో ఫిర్కా అభివృద్ధివిధానం ఒకటి.

ఈ ఫిర్కాలేమిటి? వీటిలో మళ్లీ పాత చేతిపరిశ్రమలను ఉద్ధరించటమేమిటి? దంపుడు బియ్యం, నూలువడకటం చేనేతవస్త్రం గంచరిపని,...ఏమిటీ ఈగోలంతా? డబ్బు ఖర్చు అవటం తప్ప, పల్లెలు మళ్లీ బాగుపడతవా? అంతా పరిశ్రమలో పరిశ్రమలో అని అంటుంటె, ఈయన యేమో పల్లెలు, చేతివృత్తులు, కుటీరపరిశ్రమలు అని మళ్లీ సంధ్యాకందనం ఆరంభిస్తాడేమిటి అన్నారు.

ప్రకాశాన్ని వ్యతిరేకించినవారు ఈచాదస్తాలకు స్వస్తిచెప్పి, రాష్ట్రాన్నంతా యంత్రగానంలో ముంచెత్తుతా రనుకున్నారు. విమర్శకులు కాని అలాంటిదేదీ ఏమీ జరగలేదు. ప్రకాశం చూపినంత ఉత్సాహం పట్టుదల, వ్యతిరేకులు చూపలేక పోతున్నా రనవచ్చు. కాని ఈ చాదస్తాలను ఏదోవిధంగా అమలు జరుపుతూనే ఉన్నారు. ప్రజల్లో అధికసంఖ్యాకులు పాడిపంటలతో, పశుసంపదలతో, సంపత్తుతో తలతూగుతూ వుంటినే ఆసంఘం ఆర్థికంగా, సాంఘికంగా అన్నివిధాలా బలిష్ఠంగా ఉంటుంది. అధిక సంఖ్యాకులు నివసించే గ్రామాలు ఉద్ధరింపబడనిదే, ఇదిసాధ్యంకాదు.

ఈ నాలుగేళ్లనుంచి రాష్ట్రంలో కాంగ్రెసు ప్రభుత్వాలు గ్రామాభివృద్ధి విధానాన్ని 34 ఫిర్కాల్లో మటుకే అమలుజరుపగలుగుతున్నారు అవరోధాలు లేవనికాదు, డబ్బు సుశిక్షితులైన ఉద్యోగులు, ఉత్సాహవంతులు...ఈ కొరత చాలాఉంది. ఉన్నప్పటికీ ఈకొరత చాలామటుకు తీరేది— ప్రభుత్వానికి ప్రజలను ఉత్సాహపరచి, పురిగొల్పగలిగేశక్తి ఉంటే.

ఎన్నిప్రకటనలను చేసినా, అరాచకశక్తులను ఎంత తీవ్రభాషతో ఖండించినా, ప్రభుత్వం ప్రజలను తమవైపు కార్యరంగంలో తిప్పుకోలేక పోతున్నారు. ఇది నిస్సందేహం ఇలా ఉన్నంతవరకు ఎంత డబ్బుఖర్చుపెట్టినా ఫలితం సిద్ధించదు.

రాష్ట్రంలో గ్రామాలు 35, 000పైన. ప్రభుత్వం గ్రామాభివృద్ధివిధానాన్ని జరుపుతోంది 1010గ్రామాల్లోనే. లెక్కన" ఈ తరంలో ఈవిధానం సర్వత్ర సంపూర్ణంగా అమలుజరగటం దుస్సాధ్యం.




కాని ఈవిధానం మందకొడిగా, తాబేలు నడకలా సాగుతున్నా, ఫలితాలు ఉన్నంతలో ఆశాస్పదంగానే ఉన్నయ్.

చిత్తశుద్ధితో దీక్షగా ఉత్సాహవంతులు పనికి పూనుకుంటె, పల్లెలకు మళ్లీ ప్రాణప్రతిష్ఠ జరగగలదని ఫలితాలు రుజువుచేయగలవు.

ప్రభుత్వకృషి. :

1949సంవత్సరం ఆఖరుకు ఈ ఫిర్కాల్లో 438మైళ్లు పొడవున్న కొత్తరోడ్లు పడ్డయ్. 107కొత్తరోడ్లు తయారులో ఉన్నయ్. అంతకుమునుపు తయారైన కొత్తరోడ్లు 131. 42మైళ్లు పైగా నున్న రోడ్లకు మరమ్మతులు జరిగినయ్. మట్టిరోడ్లు-30మైళ్లు పోడుగు-చేశారు. ఇదికాక 24 కొత్తమట్టిరోడ్లు పడ్డయ్. 168వంతెనలు కట్టారు. 27తయా



రులో ఉన్నయ్. ఇంకా గ్రామాల్లో బజార్లు, కాలిబాటలు, కాలివంతెనలు, కాలవలకు అడ్డీలు-వగైరా చేశారు. వీటివల్లనే, దాదాపు 000మందికి సౌకర్యం కలిగింది. 30గ్రామాలకు పెద్దరోడ్లకు మధ్య రోడ్లు పడ్డయ్.

ప్రజల తోడ్పాటు :

ఈ సందర్భంలో ముఖ్యంగా చెప్పవలసింది ఇది: ఈ పైపనులకు ప్రభుత్వపు 'పబ్లిక్ వర్క్సని' శాఖావారు పూనుకుంటె, ఇంతత్వరగా ఇవన్ని జరిగేవి కావు. ఏళ్లూ, పూళ్లూ, పట్టేవి. పైగా రోడ్డుకు కావలసిన భూమి విషయమై ప్రభుత్వం చట్టప్రకారం వ్యవహారం చేస్తే, చాలాకాలం పట్టేది. ఇప్పుడు గ్రామస్థులే చాలాసందర్భాల్లో వేలు ఖరీదుచేసే తమస్థలాలను ఊరికే రోడ్లకని ఇచ్చారు.

ఇంతే కాదు. రోడ్లు వేయటానికయిన డబ్బులో, గ్రామస్థులు కూడా చేతనైనంత వరకు చందాలు వేసుకొని కొంతభాగం ఇస్తున్నారు. 31ఫిర్కాల్లో రోడ్లకు సుమారు రు. 8, 15, 000లు ఖర్చు ఆయినవి. గ్రామస్థులు స్వయంగా, ఇచ్చింది సుమారు రు 2, 37, 600లు. మొన్న మార్చినెలాఖరుకు కొత్తరోడ్లు కొన్ని తయారుకు సిద్ధంగా ఉన్నయ్. వీటికి రు7 లక్షలు అవుతుంది. ఇందులో గ్రామస్థులు స్వయంగా ఇచ్చేవిసుమారు రు 2లక్షలనిఅంచనా

గ్రామస్థులకు నీటిసదుపాయం కలిగించటం ముఖ్యం. ఇందుకుగాను 1949సంవత్సరాంతానికి కొత్తనూతులు 421తవ్వారు. 229తయారులో ఉన్నయ్. 294పాతనూతులకు మరామ్మతులు చేశారు. 39 మరమ్మతులో ఉన్నయ్. 49మంచినీళ్ల చెరువులకు మరమ్మతులు చేశారు. ఈ నూతులు తవ్వటానికి రు 9, 16, 800లు ఖర్చుఅవుతుందని లెక్క. ఇందులో గ్రామస్థులు స్వయంగా ఇచ్చింది రు1, 96, 000.

విద్య :

218 'ఎలిమెంటరీ' పాఠశాలలు, 231 రాత్రిబళ్లు, 154పెద్దవాళ్ల బళ్లు, 118 పఠనాకేంద్రాలు, 25 కేంద్ర గ్రంథాలయాలు, 535 గ్రంథాలయ శాఖలు ఏర్పాటయినయ్. 43 రేడియోసెట్లు పెట్టారు.

(15 వ పేజీ చూడుడు)

కథానిక:

# పరీక్ష

అన్నం కలుపుకొని అట్టే ఓముద్ద నోట్లో పెట్టుకొన్నానో లేదో అప్పుడే గుక్క తిప్పకుండా ప్రశ్నలు కురిపిస్తోంది నా మీద మా కనకం. 'కూర బావుందా! పప్పు సరిగ్గా వుడికినట్టేనా, కొంచం, ఆపచ్చడి కలుపుకోండి. కమ్మగా వుంటుంది. కొంచం అన్నం పెడ్తాను. వంకాయలు వంకాయలు అని కలరిస్తూవుంటారు యేం కొంచం వంకాయకూర వేసుకుండి-చారు యెలా గుందో యేమొ!" యేప్రశ్నకు సమాధానం చెప్పకుండానే తోచినవేవో కలుపుకొని తింటున్నాను.

"మాట్లాడకుండా అంత తొందరగా తింటారెందుకండీ నెమ్మదిగా తినకూడదూ. ఉదయాన ఆఫీసుతొందరలో యే కూరగాయ ఉడకనివ్వగుగూడా! ఈపూటైనా నెమ్మదిగా కూర్చొని హాయిగా తినకూడదూ!" అని అందుకుంది మళ్లీ కనకం.

యేదో వుపన్యాసధోరణి- - - -నాకు తలనొప్పి "కాదు కనకం!" అంటూ ధోరణిని తెంపా. 'నేను నీవద్ద సిగ్గుపడ్తానా! కావలసిన వేవో అడిగివేయించుకొంటాన-కడుపు నాదికమా!"

శ్రీ ధరణికోట శ్రీనివాసులు



"యేదో మాప్రేమండీ, అలాగా అడిగితే మాత్రం దోషమంటారా!" అని ప్రశ్నార్థకంగా తలవూపింది కనకం.

"అంతప్రేమవుంటే ఓ చొక్కా కుట్టించరాదు కనకం. బలవంతంచేసి యెక్కువ పెడ్తే అజీర్ణంజబ్బు వస్తుంది-"అన్నాను నేను.

"యిప్పుడుమాత్రం జబ్బులకేం తక్కువున్నాయా! మీఆరోగ్యం యెప్పుడు బావుందన్నారు. రోజూ అజీర్ణమో మలబద్ధకమో, వుంటూనే వుంటుంది. జ్ఞాపకశక్తిలేకపోవడం, పరాకు సరే సరి; ప్రతిరోజూ ఆఫీసుతాళాలు మరచిపోవడం, రెండువస్తువులు బజారునుండి పట్టుకరమ్మంటే అందులోఒకటి మరచిపోవడం మామూలేగా!" అంది కనకం.

"నీకు మహాజ్ఞాపకశక్తివున్నట్టు మాట్లాడతా వేం?

మొన్న మజ్జిగబొయ్యమంటే వేడి వేడి చారు చేతిమీదపోసి చంపేశావు గదూ! మజ్జిగ పోస్తూన్నానని నీవు అనుకున్నావు-చూస్తూకూడా మజ్జిగఅనుకొని చెయ్యి చాచాను జాగ్రదామని నేను, యిద్దరికి అలాగే అయింది"

'యేమిటో ఓ సారి అలాగే అవుతుంది-బుర్ర సరిగ్గా పని చెయ్యదు".

'అసలు బుర్ర అవసరంలేకుండా చేసుకునేపనులకు మీకే యిలావుంటే, అహోరాత్రాలు బుర్రతో పనిచేసేవాళ్లం మా మాటేమిటి?" అన్నాను నేను.

"అదా వచ్చిన చిక్కు!" అంటూ కనకం కిలకిలా నవ్వింది. నేనూ నవ్వాను. ఈ నవ్వులో కుత్తుకపడింది. రెండు మెతుకులు ముక్కులోకి వచ్చాయి. ప్రాణం పోతుందేమో అనిపించింది. అయిదునిమిషాలకు తేలుకున్నాను.

"సారస్వతసభలు రేపటినుండే కనకం-ఎక్స్ప్రెసుకు వెళ్లుతాను తొందరగా వంటింటి పనిముగించుకో— బట్టలు అవీ కుట్టిత్తువుగాని" అన్నాడు చెయ్యి కడుక్కుంటూ-

"పదిగంటలకు కదండీ బండివస్తుంది-యింకా మూడుగంటల టైముంది. మాట్లాడుతూ కూర్చొండి-నేను తొందరగా భోంచేసుకొంటాను - ఒక్కదాన్ని కూర్చొని తినలేను"అంది కనకం.

సరె పీటనుకొంచందూరం గుంజుకొని కూర్చున్నాను ఆ రోజు తన యాజమాన్యంలో యింట్లోజరిగిన ముచ్చట్లన్నీ యాకరు పెట్టూవుంది.

"మంచినీళ్లు అయిపోయినాయండీ— కాస్త యీ చెంబుతీసుకొని బిందెలోంచి ముంచి యిస్తురూ! అని పురమాయించింది కనకం.

సరే. ఆపని చేసిపెట్టాను.

"చూడండి—యేమో అనుకోక కాస్త ఆగరిటె తీసుకొని కొంచం అన్నం వేతురూ—మళ్లీ చెయ్యి కడుక్కోవాలి"

శ్రీహరీ—మళ్లీ లేవాల్సివచ్చింది-ఆపని చేసిపెట్టి అవతలపడడానికి ప్రయత్నించాను.

'అయ్యో! మరచానండీ-వుప్పుచిప్ప అగూట్లోవుంది. కాస్త అందుకుంటారూ వడ్డిగ వేసుకొంటాను' అని మళ్లీ ఓపని పెట్టింది.

భగవంతుడు జ్ఞాపక మిచ్చాడు—లేచి వుప్పుచిప్ప తెచ్చి ముందుపెట్టాను.

"అయ్యో మెత్తని వుప్పు అయిపోయిందండీ. ఈ వెధవరాళ్లను వేసుకోలేను. చూడండి-ఆగూట్లో రొట్టెలపీటవుంది దానిమీద నాలుగురాళ్లువేసి మెత్తగా చేసి యిస్తురూ!" అంది కనకం.

ఓహోయ్—పాకం ముదురుతూంది-భోజనవిషయంకాబట్టి ఆపనేదో చేసి బయట పడ్డా కొంచం ఛలిగాలి వీస్తుంది. వరండాలో పచారుచేస్తూన్నాను. గదిలో పడుకుంటూ వున్న చంటిది, గోమలుకుట్టిన్నాయోయేమో తెగని యేడుపు ప్రారంభించింది.

"కొంచం అమ్మాయిని వూరుకుంచండి యిప్పుడే వస్తాను" అంటూ వంటింట్లోంచి యింకోపని చెప్పింది.

ఎత్తుకొని యెంత లాలించినా అమ్మాయి యేడుపు మానడం లేదు.

"నీకో బొమ్మను కొనిస్తానమ్మా రేపు" అన్నాను వూరుకుంటుందేమో అని.

యేడుపు మరీ యెక్కువయింది. "నీకో గాడిదబొమ్మను, అన్నయ్యకు ఓ కుక్క బొమ్మను కొనిస్తాను" అని మళ్లీ లాలించినాను—

అమ్మ రాలేదనో యేమో, యేడుపు యింకా యెక్కువయింది. నరాలు తెగిపోతాయేమో అనిపించింది.

'కాదమ్మా అన్నయ్యకే గాడిదబొమ్మ నీకే కుక్కబొమ్మ-సరేనా' అన్నాను. వట్టియేడుపే గాక కాళ్లుచేతులు కూడా కొట్టుకుంటూ వుంది.

'కనకం నీకేరా—యిహ నేను సముదాయింగలేను' అని పిల్చాను కనకాన్ని—

పరిగెగా వచ్చి అమ్మాయిని చేతుల్లోకి తీసుకొంది - యేడుపుచప్పున ఆగిపోయింది యేదో మందుపెట్టినట్లు - కాదు యేదో దేవతామూర్తి వచ్చి అభయం యిచ్చినట్లు.

ముసిముసినవ్వులు నవ్వుతూ నావైపు చూచింది. కనకం పిల్లలను సముదాయించడం చాతకాదూ అన్నట్టుగా, మొహంపెట్టి. "అవును"అన్నట్టుగా నేనూ మొహం పెట్టాను.

ఆవిడ మొహంలో యేముందో చూడగానే యెంతయేడుపులోవున్నా చప్పున వూరుకుంటారు పిల్లలు...... పిల్లలవరకెందుకూ, ప్రతిరోజు ఎన్నో అవకతవకలు చింతా చీకులకు గురియైనా యింటికివచ్చి కనకాన్ని చూచుకొని నేనే అన్నీ మరచిపోతాను.

'టైం అయింది కనకం' అన్నాను.

'వస్తున్నానండీ. అమ్మాయికి పాలు యిచ్చి బట్టలు కట్టిస్తాను.

'నేనే కట్టుకుంటానులే' అంటూ ఒక్కొక్కటి తెచ్చుకున్నాను.

'బట్టలు మూడురోజులకు సరిపడేటట్టు తీసుకెళ్లండీ' అంది కనకం. "ఛలిగావుంది రగ్గుకూడా కట్టుకెళ్లండీ. ఓకోటుచాలు— ఆనల్లగీతల షర్టు పెట్టుకొండి. అది మీకు చాలా బావుంటుంది — బనీనులు రెండు వుండనివ్వండి..."

"అలాగే" అన్నాను నేను.

"జాగ్రత్త అన్నీ చూసుకోండి— అక్కడికెళ్లి అవస్థపడ్తారు."అని మళ్లీ హెచ్చరించింది. కనకం.

యెందుకైనా మంచిదే అనుకొని మళ్లీ ఓసారి కలియచూచుకొన్నా సామానులన్నీ.

"కాస్త పండ్లపొడి వెంటనుండనివ్వండి. ఓమరచెంబుకూడా తీసుకవెళ్లండి" అంది కనకం.

యింకా నయం......ఓరెండు గిన్నెలు కొంచెం బియ్యం తీసుకపొమ్మనలేదు.

రాత్రి పదింటికల్లా రైలును పట్టుకున్నాను. చిక్కలిగింతలుపెట్టే ఆఛలిరాత్రంతా ప్రయాణం చేస్తూ మంచిర్యాల చేరుకున్నా. మహాసభలో యేర్పరచిన మా బసకువెళ్లి ధోతికట్టుకుందామని పక్కచుట్టను విప్పా- అసలుధోతులు పెట్టుకోవడం మరచాను. బాగా వెతికిచూస్తే సన్నని రెండుమెత్తల క్రింద పచ్చకమ్మల ఓతెల్లచీర కనబడింది.

పరీక్షు --- నేను బట్టలు కట్టుకున్నప్పుడే యిలాగ కావాలీ!

యిలాగుంది నా వేషం— - —యిహ మాకనకం అంటుందంటే యెందుకనమా!—

---

# పల్లెల పునర్నిర్మాణం

(12-వ పేజీ తరువాయి)

ఇలాగే వ్యవసాయం, వైద్యం, శుచి, శుభ్రత, సహకారం, పంచాయతీలు ఈ విషయాలన్నిటిలోనూ గ్రామస్థులు ముందుకు వచ్చి ప్రభుత్వంతో కలసి పనిచేస్తున్నారు. మామూలుగా ప్రభుత్వం చేసే పద్ధతిన అయితే ఈ పనులన్నిటికీ ఆలస్యమేకాక, ఇంతకన్న చాలా ఎక్కువడబ్బు అయేది. చాలాసందర్భాల్లో అయ్యేఖర్చుల్లో సగానికి సగం గ్రామస్థులు స్వయంగా భరిస్తున్నారు. బస్తీల్లో పని, డబ్బుఅంతా సర్కారే భరించాలి.

ఈ గ్రామాభివృద్ధివిధానాన్ని నిర్వహిస్తున్న ఉద్యోగస్థులు అధికారవాతావరణాన్ని పూర్తిగా మరచిపోయి, గ్రామస్థుల్లో ఒకళ్లై, వారికి స్పష్టంగా కార్యక్రమాల శ్రేయోపయోగాల గురించి తెలియజేస్తే, గ్రామస్థులు ఇప్పటికన్న ఉత్సాహంగా ముందుకు వస్తారు. ఇప్పటికన్న ఇంకెక్కువగా ఆర్థికసహాయం ఇవ్వగలరు. డబ్బుకు వచ్చే కూలీలలాగా, ఆఫీసర్లలాగా కాక, పని నెత్తిన వేసుకుని, స్వంతపనిలా చూసుకుంటారు.

రైతులనుంచి శిస్తుకు సమానమైన డబ్బును రాష్ట్రప్రభుత్వం అప్పుగా తీసుకోవాలని ఆమధ్య ఊహాగానం చేశారు. అంతకన్న ఏగ్రామాని కా గ్రామంలో, మంచి నీటివసతి, చదువు, వైద్యం, రోడ్లు వేస్తాం. గ్రామస్థులు శక్తికొద్దీ, ఆస్తులుకొద్దీ ప్రభుత్వానికి ఆర్థికసహాయం, మనుష్యసహాయం చేయాలంటే, గ్రామస్థులు ప్రభుత్వపు మాటకు చెవి ఒగ్గుతారు.

ప్రచారం:

ఈ ఫిర్కాకేంద్రాల్లో జరుగుతున్న విషయాల గురించి సవిస్తరంగా ప్రచారం జరగాలి. కరపత్రాలు, చిన్న పుస్తకాలు అచ్చువేసి, విధానం అమలు జరగని ప్రాంతాల్లో విరివిగా గ్రామగ్రామాన పంచిపెట్టాలి. అమలు జరగని పల్లెటూళ్లలోని గ్రామస్థులను కొంతమందిని అమలు జరుగుతున్న కేంద్రాలకు తీసుకువెళ్లి, జరుగుతున్న పనిని వాళ్లకు చూపించాలి. గ్రామాల్లో సభలు, సమావేశాలు జరగాలి. ఇలా గ్రామస్థుల్లో ఉత్సాహం కల్గించటం అత్యవసరం.

తక్షణకర్తవ్యం:

ఇప్పుడు, హైదరాబాదుసరిహద్దు పల్లెల్లోనూ, కృష్ణాజిల్లాప్రాంతంలోనూ కమ్యూనిస్టుల విధ్వంసకచర్యలు సాగుతున్నయ్. ఈ ప్రాంతాల్లో పోలీసుస్టేషన్లు కొత్తగా పెట్టి పోలీసుబలగాన్ని పెంచటం ఎంత ముఖ్యమో అంతముఖ్యం, ఈ ప్రాంతాల్లో గ్రామాభివృద్ధివిధానాన్ని అమలుజరపటం. కమ్యూనిస్టుల కార్యక్రమం వినాశన--కార్యక్రమం అని పదేపదే వల్లిస్తే లాభం లేదు. ఆ వినాశనకార్యక్రమం అమలుజరగుతున్న ప్రాంతంలోనే ప్రజలు ప్రభుత్వంయొక్క నిర్మాణకార్యక్రమాన్ని సాక్షాత్తూ చూసి, దాని శ్రేయోపయోగాలను స్వయంగా అనుభవించాలి. అప్పుడే ప్రజలు మనస్ఫూర్తిగా, దృఢసంకల్పంతో, సాయకుల్లా, ప్రభుత్వానికి జడిసి సహకరించటం బదులు, నిజమైన ప్రజాసైన్యంగా తయారై, ఇన్నిశతాబ్దాలకు సిద్ధించిన ప్రజాస్వామ్యవ్యవస్థను రక్షించుకోగలుగుతారు.

# మిళిందప్రశ్న

(పరిచయము)

## శ్రీ కంచిపూడి జానకిరామరాయచౌదరి

ఈ గ్రంథము భారతదేశములోని ప్రాచీన వచనగ్రంథముల కెల్ల శిరోమానికము. అంతియేగాక ప్రపంచమున నిట్టి తరగతికి జెందిన మరి యే యితరగ్రంథము సారస్వత దృష్ట్యా దీనికి సరిగ తులతూగలేదు-రయిస్ డేవిడ్సు.

క్రీస్తుశకారంభమునకు మొదటగాని, కొంచెము తరువాతగాని మిళింద నాగసేనుల సంవాదకమగు నీగ్రంథము రచింపబడెను. ఇయ్యది సంస్కృతభాషలోనో, తత్సంబంధమైన ప్రాకృతిభాషలోనో రచింపబడి యుండును. కాని యియ్యది తన జన్మస్థానమగు భారతదేశమునుండి, యెప్పుడు తరలిపోయినదో, యేమైనదో కాని స్వరూపము లేకుండపోయినది. తరువాత సింహళద్వీపమునకు, అద్దానినుండి బౌద్ధమతము వ్యాప్తినొందిన మరికొన్ని యితరదేశములందును, యిది ప్రచారమున నుండియున్నది. భారతదేశమునుండి సింహళముజేరిన యీ గ్రంథమచట గను భక్తిశ్రద్ధలతో జాగ్రత్త పరుపబడి, యాదేశపు మతజీవితమున నతిప్రాముఖ్యము వహించియున్నది. పాళీత్రిపిటకముల తరువాత నీగ్రంథము రెండవస్థాన మాక్రమించియున్నది. కొంచెము హెచ్చుతగ్గు బుద్ధఘోషుని ప్రసిద్ధమగు 'ధమ్మపథము' మాత్రము దీనితో సరిగ తులతూగును. సింహళదేశమునుండి యీ గ్రంథము పాళీరూపమునందే, బర్మా, సయాము దేశములకు కూడ పోయి, యున్నతస్థాన మాక్రమించియున్నది. చైనా దేశమున సహితమీ గ్రంథము ప్రచారమున నుండియుండెనని చెప్పుటకాధారములు గలవు. బౌద్ధమతమునకు సంబంధించిన యనేకవిషయములగూర్చి, యిది ప్రామాణికగ్రంథమని చెప్పవచ్చును. ఆ మతమునందలి ప్రముఖ విషయములను గూర్చి సంశయాస్పదములు కాజొచ్చినవారికీ గ్రంథము జవాబు. సత్యబద్ధములగు నా విషయములనుగూర్చి రోషుకూప పరీక్ష జేయువారికీ గ్రంథము సమాధానము.

మతవిషయకముగనేగాక, భాషాప్రపంచమునగూడ దీనికొక యున్నతస్థానమున్నది. భారతదేశమున వ్రాయబడి, నేటికి సజీవముగ నున్న గ్రంథములలో, ప్రప్రథమమగు యుత్తమవచనకావ్య మిదియే యని చెప్పవచ్చును. ఆధునికదృక్పథమున జూచినను, ప్రాచీనభారతమున వ్రాయబడిన వచనకావ్యములలో నీ గ్రంథమొక కళాఖండిక యని చెప్పవచ్చును. మిళిందనాగసేనుల యీ సంవాదము బుద్ధభగవానుని మహాపరినిర్వాణానంతర మయిదువందల సంవత్సరములకు జరిగినదని చెప్పబడియున్నది క్రీ. శ. 430 ప్రాంతమున తన ప్రసిద్ధగ్రంథమును వ్రాసిన బుద్ధఘోషుడీ మిళిందనాగసేనుల సంవాదము నుండి పలుమారు లుదహరించి ప్రామాణ్యముగ జెప్పియున్నాడు. దానినిబట్టి, బుద్ధఘోషుడు తన గ్రంథములను వ్రాయునప్పటికి యీ మిళిందప్రశ్న యతనికడ నుండుటయేగాక, యప్పటికే యది ప్రామాణ్యముగ నంగీకరింపబడు గ్రంథముగ ప్రసిద్ధిజెంది యుండెను. అందువలన నంతకు పూర్వమెప్పుడు రచింపబడినను, అయిదవశతాబ్దమునకు మిళిందప్రశ్న బౌద్ధప్రపంచమున ప్రాముఖ్యత వహించిన గ్రంథమై యుండెనని నిశ్చయముగ జెప్పవచ్చును.

మిళిందరాజునకు, నాగసేనస్థవిరునకు జరిగిన సంభాషణగా నీ గ్రంథమున్నను, ఇందు మిళిందుని పాత్ర స్వల్పము అతడు ప్రశ్నలడుగుటకు మాత్రమే. ఆ రోజులకు బౌద్ధమతమునుగూర్చి, యనేకులలో ప్రబలిన సంశయములు, వితండవాదములు, మిళిందుని వాగ్రూపమున జెప్పబడి, నాగసేనుని వివరణరూపమున ఖండింపబడినవి. నిజమునకిది బౌద్ధమతవ్యతిరేకుల వాదనలను ఖండించు గ్రంథము. కాని యాఖండన, సామాన్యముగ సిద్ధాంతఖండనలు వ్రాయునట్లు, పొడిపొడిగను, విసుగులగను నుండునటుల వ్రాయబడక, అతి మనోహరముగను, కళాభరితముగను వ్రాయబడినది. వ్రాయబడినది. పాతకుని యభిరుచి, యుత్సాహము, చదువుచున్న కొలది మిన్నంటునటుల మిక్కిలి సామగ్ర్యతతో సంభాషణలు నిర్వహింపబడినవి. నిజమునకది, గొప్పఉపజ్ఞాపూరితుడే గాక, కళాభరితుడు కూడ నయియున్నవాడు చేయగల పని.

అనంతరము మిళిందుని గురించి కొలదిగ తెలిసికొనవలసియున్నది. మిళిందపదము మినాండరు నామమునకు పరివర్తనయై యున్నది. మినాండరు భారతదేశపు వాయువ్యసరిహద్దుప్రాంతమును పాలించిన 'బాక్ట్రియను' రాజు. భారతదేశమున, తూర్పునకు, యవనరాజ్యమును వ్యాపింపజేసిన బాక్ట్రియను రాజు లిరువురిలో మినాండరు యొకడని స్ట్రాబో చెప్పియున్నాడు. అతడు సెట్లెజునదిని దాటి, యమునాప్రాంతము వరకు వెళ్ళియున్నాడని చెప్పబడుచున్నది. 'జస్టిన్' యొక్క గ్రంథములో, మినాండరు, యపోలోడోటిస్, లిరువురు హిందూదేశపు రాజులుగ పేర్కొనబడియున్నారు. మినాండరు న్యాయపాలకుడగు రాజనియు, ప్రజల యాదరాభిమానములను పొందినవాడనియు, అతని మరణానంతర మతని యస్థికలకై వివిధపురములవారు కలహపడిరనియు 'ప్లూటార్కు' చెప్పియున్నాడు. కాని మనకు మినాండరునుగురించి ప్రాముఖ్యముగ సాక్ష్యము జెప్పునవి, యతని నాణెములుమాత్రమే. అతనికి జెందినవి యిరువది రెండు రకముల నాణెములు కనుగొనబడినవి. వానిలో నెనిమిదిమాత్ర మతని ముఖచిత్రములను గలిగియున్నవి. అవి పశ్చిమమున కాబూలు మొదలు తూర్పున మధురవరకు, యుత్తరమున కాశ్మీరమువరకుగల ప్రదేశముల లభ్యమైనవి.

మినాండరు బౌద్ధుడా, కాదా యని నిర్ణయించుట కవకాశములేదు. అతని వివిధమగు నాణెములలో నొకదానిమీద చక్రము

చిత్రింపబడియున్నది. మరియొక నాణెముపై "మహారాజస, ధర్మికాస, మెనాందరస" యని వ్రాయబడియున్నది. ఈ చక్రము బుద్ధునిచే పవిత్రమైన యిసిపట్టణమున చలన మొనరింపబడిన ధర్మచక్రమున కెంత వర్తించునో, యీ 'ధర్మ'మను మాట బుద్ధునిచే ప్రబోధితమైన ధర్మమున కెంతవరకు వర్తించునో చెప్పవలనుపడదు. కాని యెందులకు కాగూడదని మనము ప్రశ్నింపవచ్చును. ఒకప్పటికీ, బాక్ట్రియనురాజులు, ప్రజలు కూడ బౌద్ధులైరన్న విషయము మనము మనస్సునం దుంచుకొని, జూచినయెడల పై విషయము సంభవమైనదిగనే మనకు తోచవచ్చు. కాని మొత్తమున మనము చెప్పగలిగినది, మీనాండరు బాక్ట్రియను రాజనియు, అతడు భారతదేశమున, తన రాజ్యమును యితర యవనరాజులకన్న నెక్కువగ వ్యాపింపజేసెననియు చెప్పగలము. అతడు క్రీ. పూ. 140 మొదలు 110 సంవత్సరములవరకు పరిపాలించె అతడు సింధునది యందున్న 'అలసంద' యను ద్వీపమున గల 'కలాసి' యనుచోట జన్మించెనని మన గ్రంథము చెప్పుచున్నది. మరియు మీనాండరుకు జెందిన యొక నాణెమున 'కరిసి' యను నొక పట్టణము పేర్కొనబడియున్నది. యీ నాణెము క్రీ. పూ. 180 సంవత్సరమున యూక్రటీడస్ చేత వేయబడినదై యున్నది. యీయూక్రటీడస్ సింధునదిప్రాంతమున మొదట వలసస్థాపించియున్నాడు. అందువలన నీ 'కరిస' యను 'కలాసి' యు నొకటియై యుండునని చెప్పవచ్చును. మరియు నీ గ్రంథమున కొన్ని యెడల ప్రస్తావింపబడిన, మరికొందరు వ్యక్తుల నామములను గురించి మనము తెలిసికొనవలసియున్నది. నాగసేనుని జూచుటకు పోయినప్పుడు మిళిందుని వెంట దేవమంతియుడు, అనంతకాయుడు, మంకురుడు, సబ్బాదిన్నుడను రాజోద్యోగులు పోయి యుండిరి. వారెవరని చూచుటకా నామములు హైందవ నామములుగ నున్నను, వాస్తవమున కవి పరివర్తనజెందిన యవన నామములై యుండునని నిశ్చయముగ జెప్పవచ్చును. దేవమంతియ నామము, డెమ్రోయస్ యను నామమునకు పరివర్తనము. అనంతకాయుడు, యాంటికోయస్ అయి యుండును. మంకురుడు, సబ్బాదిన్నుడు యెవరో చెప్పుట కష్టము. మరియు వేరొకచో నుదహరింపబడిన సందగుత్తుడు, సాండ్రోకోటస్, యని చెప్పబడుచున్నది.

నాగసేను డెవరో, యెచ్చటివాడో, యెప్పటివాతో, మనము చారిత్రాత్మకముగ జెప్పుట కవకాశములేదు. కాని యతడు నాగార్జునుడు కాడనుమాట నిస్సంశయము. నాగార్జునునిచే ప్రచార మొనరింపబడిన మహాయాన విధానమునకును, యీ గ్రంథమునందలి విషయములకును సంబంధము లేకపోవుటయేగాక, యవి పరస్పరవిరుద్ధమైనవికూడను. బుద్ధుని మరణానంతరము 137 వత్సరములకు నాగసేనుని యాధ్వర్యమున, సంఘమున నొక కథ లేచెనను విషయమొక, టిబెట్టియన్ గ్రంథమున వ్రాయబడినదని ('Schiefrer') చెప్పియున్నాడు. ఆ నాగసేనుని ప్రసిద్ధి, యప్పటికింకను, ప్రచారమున నుండుటచే, యా నామమునే మన గ్రంథకర్త తీసికొని, తన గ్రంథమున నాయకునిగ నొరరించెనేమో యని రయిస్ డేవిడ్సు యూహాగానము చేసియున్నాడు. ప్రొఫెసర్ కెర్న్, నాగసేనుడను చారిత్రక వ్యక్తి బౌద్ధమతమున నెవరును లేరనియు, నిచట నుపయోగింపబడిన నాగసేననామము పతంజలియొక్క రెండవ నామమనియు, అందున నతడు పతంజలితప్ప మరియొకడు కాడనియు చెప్పియున్నాడు. అతని వాదమున కాధారము పతంజలికి నాగేశ, పాణిని, యను బిరుదు లుండుటయే. కాని యిది హాస్యాస్పదమైనది. పతంజలి యాత్మసిద్ధాంతమును నమ్మిన హైందవుడు. నాగసేనుడు ఆత్మలేదను బౌద్ధుడు.

బౌద్ధస్థవిరులలో ప్రముఖుడగు 'మొగ్గలిపుత్రతిష్యుని గాథయు, నాగసేనుని వృత్తాంతమును చాల పోలికలలో నేకీభవించియున్నవి. తిష్యునిజన్మ, మతదీక్ష, జ్ఞానార్జన, అతడశోకునిదగ్గరకు వచ్చుట, అశోకునిచే ప్రశ్నింపబడుట, యామిథ్యావాదములనెల్ల ఖండించి నాస్తికుల పారద్రోలుట యనునవన్నియు, నాగసేనుని జన్మ. మతదీక్ష, జ్ఞానార్జన, యతడు మిళిందునిదగ్గరకు వచ్చుట, మిళిందునిచే ప్రశ్నింపబడుట, యామిథ్యావాదములనెల్ల ఖండించి, నాస్తికతను నిర్మూలించుటను పోలియున్నవి. అందువలన మిళిందనాగసేనులకథ, మొగ్గలిపుత్ర అశోకుల వృత్తాంతముపై నాధారపడియున్నదేమో యను సంశయము పొడసూపక తప్పదు. కాని యది నిర్ధారణచేయలేని యూహామాత్రమే యయియుండినను యుండవచ్చును. ఇందనేక గ్రంథములలోని విషయములు పేర్కొనబడినవి. అనేక జాతక కథలలోని సంఘటన లుదహరింపబడినవి. త్రిపిటకములనుండి పలుమారులు ప్రస్తావింపబడినది. బౌద్ధగ్రంథముల నున్న విషయములేగాక, యితరములగు ననేకవిషయములను, పట్టణములను, దేశములను, స్థలములను గ్రంథకర్త పేర్కొనియున్నాడు. మరియు నా కాలమున నున్న, యనేక యాచార వ్యవహారములు, శిక్షావిధానములు, న్యాయసూత్రము లిందు ప్రస్తావింపబడి యున్నవి. అన్నిటికన్న ముఖ్యమైన విషయములు దీని మనోహరమగు శైలి చక్కని సంవాద విధానములు. రయిస్ డేవిడ్సు యీ గ్రంథము భారతదేశములోని ప్రాచీనవచనగ్రంథముల కెల్ల శిరోమానికమని పేర్కొని యున్నాడు. అంతియేగాక యట్టి తరగతికి జెందిన గ్రంథములలో నిది సారస్వతదృష్ట్యా ప్రపంచమున గల గ్రంథముల కెల్ల నుత్తమమైనదని చెప్పియున్నాడు.

# మాతృవిజ్ఞానం:



## స్వేచ్ఛ

ఏడాది దాటిన యీడులో పాపకి అంతా కొత్తగా సరదాగా ఉంటుంది పాపలో అనేకమార్పులు కనిపిస్తాయి మనుష్యుల్తో వ్యవహారాల్లో పెద్ద మార్పు కలుగుతుంది తనకూడా సొంతబుద్ధి ఉందన్నట్లు ప్రవర్తిస్తాడు.

ఇంతకుముందు పాప పాకలేనిస్థితిలో ఉన్నప్పుడు అమ్మ తన ఇష్టంవచ్చినప్పుడు పడుకోబెట్టేది. ఆమె అనుకున్నప్పుడు ఆహారమిచ్చేది. అమ్మకి మనసు వచ్చినప్పుడు పాపని అలంకరించేది తనకి తోచిన లక్క కాయ లిచ్చేది. అమ్మ ఎంతపెత్తనం చలాయించినా ఏతగువూ పెట్టకుండా బుద్ధిమంతుడిలా పాప వినేవాడు. కాని ఇప్పుడల్లా కాదు. తనకీ ఇష్టాయిష్టాలున్నాయని నిరూపించుకోడానికి ప్రయత్నిస్తాడు తనకీ వ్యక్తిత్వం ఉందన్నట్లు స్వతంత్రం వెలిగించబోతాడు

తన కిష్టంలేని పనిని తల్లి తలబెట్టినట్లయితే ఇంక ఊరుకోకూడదని నిర్ధారణ చేసుకుంటాడు. అలాగని వాడి నైజం చెప్తుంది మాటల్లోనో చేతల్లోనో "అలా వీల్లేదు" అని తెలియచేస్తాడు ఒక్కొక్కప్పుడు తనకి నిజంగా ఇష్టమున్నప్పటికీ, కేవలం తన పంతం నెగ్గుతుందో లేదో చూడాలన్నట్లు అయిష్టం ప్రకటిస్తాడు. ఇవి పాపకి "పెంకిరోజులు" అన్నమాట. తల్లులు "చెప్పినమాట బొత్తిగా వినడం మానేశాడమ్మా" అంటారు మంకుతనం ఎక్కువైందంటారు.

కాని ఒక్కక్షణం ఓపిగ్గా ఆలోచించి చూడండి వాడు ఆ యీడులో అల్లా అనకపోతే, పెరిగి పెద్దవాడైనప్పుడు ఒట్టి బద్ధమ్మ అయిపోగలడు వాడల్లా ఉన్నన్నాళ్లు నిత్యం పెత్తనం చలాయించడం పురమాయించడం అలవాటయిపోతుంది. సామాన్యంగా పాప తిరగబడితేగాని ఏతల్లికి ఈ అలవాటు తప్పిపోదు. దానితో వాడికి స్వయంకృషి మృగ్యమైపోతుంది ఏదీ నేర్చుకోలేకపోతాడు. మానసికాభివృద్ధి కుంటుపడుతుంది. పెద్దవాడై నలుగురిలోనూ మసలవలసిన అవసరం కలిగినప్పుడు ఒళ్లోగాని, ఆపైన జీవితంలోగాని ప్రతివాళ్లకీ లోకువైపోతాడు ఎందుకూ పనికిరానివాడౌతాడు

ఈ యీడులో కొత్తవిషయాల్ని తెలుసుకోవాలనే కుతూహలం పాపకి అపరిమితంగా ఉంటుంది డిటెక్టివ్ కంటేనూ, రిసెర్చి స్కాలర్ కంటేనూ అధికాసక్తితో అన్నీ కనిపెట్టడానికి పట్టుదల చూపుతాడు ప్రతిమూలా ప్రతివస్తువునీ పరిశీలిస్తాడు చేతికందే ఏ వస్తువుమీదా చెయ్యివెయ్యకుండా ఉండలేడు చెంబులూ తప్పేలాలూ, పెట్టెలూ బట్టలూ, పుస్తకాలు కలాలూ, స్నోలూ పౌడర్లూ, సీసాలూ దీపాలూ ఒకటేమిటి అన్నిటినీ పరామర్శించకుండా విడిచిపెట్టడు సిరబుడ్డిలో వేళ్లెడతాడు మంచినీళ్ల బిందెలో చేతులెడతాడు, కుంపటి లాగుతాడు. తలుపుసందుల్లో వేళ్లు నలగ్గొట్టుకుంటాడు పెట్టెలూ గూళ్లూ ఎక్కుతాడు. దీపాలు బోర్లదోస్తాడు అడ్డమైన వస్తువూ నోట్లో పెట్టుకుంటాడు బిందెలో చెంబు పడేస్తాడు చెంబులో పప్పుగిన్నె పెట్టబోతాడు పట్టకపోతే గిన్నెతో దెబ్బలాడతాడు ఆ తరవాత ఏడుస్తాడు కూడా. తల్లికి ప్రాణం విసిగిపోతుంది "పాడుచెయ్యని వస్తువు లేదమ్మా" అని ఇరుగుపొరుగు వారితో అంటుంది బాధపడలేక విసుక్కుంటుంది కాని నిజంగా అదంతా కోపం కాదు. అయితే ఈయీడులో వాడి మనస్సుని కనిపెట్టాలనే శ్రద్ధ ఎవరికీ ఉండదు పాప తన చుట్టూఉన్న ప్రపంచాన్ని కనిపెట్టాలి అది అవసరం ప్రతివస్తువూ ఏమిటో తెలుసుకోవాలి కదిలేవీ కదలనివీ ఏవో వాడికి తెలియాలి ఏవస్తువుతత్వ మేదో గ్రహించడానికీ పాప ప్రయత్నిస్తాడు. ఇందులో తన కౌశలాన్ని ఈ వస్తువులపైన ఎలా ప్రయోగించదలడో పరీక్ష చేసి చూస్తాడు కాలేజీకెళ్లేముందు స్కూళ్లో చదవ్వలసినట్లు, అంతకుముందు ఓనమాలు నేర్చుకోవలసినట్లు పాపకి విషయపరిజ్ఞానం క్రమక్రమంగా లభిస్తుంది ఏవస్తువునీ విడిచిపెట్టకుండా పాడుచేస్తున్నాడంటే వాడి బుద్ధి క్రమంగా వికసిస్తోందన్నమాట.



ఏప్రిలుమాసంలో అమెరికాలో సర్కసుప్రదర్శనాలు ఆరంభమవుతాయి. 20 సర్కసులు అమెరికను నగరాలు ఏటా పర్యటిస్తాయి. వాటిలోకల్లా పెద్దసర్కసు రింగ్లింగ్ బ్రదర్స్ సర్కసు. ఈ సర్కసులో జంతువులే 900 ఉన్నాయి.

అయితే అన్నివస్తువులూ తగలేస్తుంటేనూ, చేతులు కాల్చుకుంటుంటేనూ చూస్తూ ఊరుకోవాలని అర్థం కాదు పాడయ్యే వస్తువులూ, ప్రమాదం కలిగించే వస్తువులూ వాడికి అందుబాటులో లేకుండా చేసుకోవలసిందే కాని ప్రమాదంలేని వస్తువుల్ని పరీక్ష చెయ్యనివ్వాలి వస్తువుల్ని పాడుచెయ్యకుండా పరీక్ష చేసేలాగు నేర్పాలి అసలు చుట్టూ ప్రపంచాన్ని గురించి తెలుసుకోవాలని పాపకి అతిఆత్రం ఉంటుంది ఒకవస్తువుని చూస్తూ మరొకటి కనిపించేసరికి మొదటి వస్తువు నొదిలేసి రెండోవస్తువుకోసం ఎగబడతాడు దీన్నే వీలుగా ఉపయోగించవచ్చును సీసా పట్టుకుని ఆడుతున్నప్పుడు అది బద్దలు కొడతాడని భయముంటే ఏ చెంబో చెంచాయో ఇచ్చి వాటిని మళ్లించి సీసాలాక్కోవచ్చును

క్రమంగా రోజులు గడుస్తున్నకొద్దీ స్వేచ్ఛ అలవడుతుంది తల్లిపైన సహాయానికి ఆధారపడుతూవుంటాడు రెండూ పరస్పరవిరుద్ధాలే అయినప్పటికీ రెండూ పాపలో పోటీచేస్తాయి పాపని పడుకోబెట్టి అమ్మ అల్లా వెడితే చాలు ఏడుపారంభిస్తాడు అంతమాత్రానికి ఇది జాస్తిగా చెడు గనకోరాదు దీని అర్థం తనవాళ్లపట్ల గాఢానురాగం అల్లుకుంటోందన్నమాట దీనివల్ల కొంత పెద్దలకి ఇబ్బంది కలగవచ్చును కాని మంచిదే స్వేచ్ఛను అలవరుచుకుంటున్నప్పుడే తల్లిదండ్రుల్నీ అక్కల్నీ అన్నల్నీ ప్రేమించడంకూడా నేర్చుకుంటున్నాడు

తల్లి పనిచేసుకుంటున్నప్పుడూ రెండు చెంబులు ముందరేసుకుని ఆడుకుంటాడు కొంతసేపటికి వాడికి విసుగుపుడుతుంది మెల్లిగా పాకి వెళ్లి వసారాలో చేరతాడు అక్కడ సగదుల్ని తనిఖీచేస్తాడు గోడసున్నం, నేలమన్ను రుచిచూస్తాడు బల్లల కింద దూరతాడు కొంతసేపైనతరవాత దగ్గర ఎవరైనా ఉండాలని మనసు పుడుతుంది ఉన్నట్టుండి వంటఇంట్లోకి దారితీస్తాడు ఒక క్షణంలో స్వేచ్ఛగా ఉండాలనుకుని అమ్మదగ్గరనించి లేచి వెళ్లిపోతాడు మరొక క్షణంలో అమ్మను వెతుక్కుంటూ వస్తాడు

మాసాలుగడిచినకొద్దీ వస్తుపరిశీలనలో ధైర్యం సాహసం, కుతూహలం విచక్షణ అధికమౌతాయి. అప్పుడు కూడా అమ్మ కావాలి. అవసరమైనప్పుడు అమ్మ ఉంది కదా అనేభావం పాపకి ధైర్యం కలిగిస్తుంది ఈ ధైర్యంపైనే స్వేచ్ఛగా ప్రవర్తించగలుగుతాడు కాబట్టి అమ్మపై ఆధారపడ్డమే పరోక్షంగా స్వేచ్ఛకి దోహదమిస్తుంది ఇందుకు చెప్పవలసివచ్చిందంటే, కొందరుతల్లిదండ్రులికి పిల్లల స్వేచ్ఛని గురించి విచిత్రమైన అభిప్రాయాలున్నాయి కొందరు పిల్లలకి స్వేచ్ఛ, స్వాతంత్ర్యం "నేర్పాలనే" ఉద్దేశంతో వాళ్లు ఏడుస్తున్నప్పటికీ ఒంటరిగా విడిచిపెట్టడం, కొత్తవాళ్లకి ఒప్పగించడంవంటివి చేస్తుంటారు ఇది పొరపాటు అమ్మకావాలని పాప ఏడ్చినకొద్దీ, అమ్మపైన ఆధారపడ్డం అధికమౌతుంది

కాబట్టి ఏడాది దాటేఈడులో పాప ఏమార్గం అనుసరించాలో నిర్ణయించుకోవలసిన సమయం వస్తుంది పాపకి తగిన వీలిస్తే స్వతంత్రనిర్వహణ క్రమంగా నేర్చుకుంటాడు కొత్తవాళ్లతో నిర్భయంగా మసలడం నేర్చుకుంటాడు ముందుముందు బళ్ళో చేరినప్పుడు మిగతా పిల్లలందరిమధ్యా సమర్థతతో మెసులుకోగలుగుతాడు అప్పుడు వీధిలోకి వెళ్ళడానికి భయపడడు. కాని వాడిని ఇంట్లోనే మగ్గబెట్టి, కొత్తవాళ్లదగ్గరకి చేరకుండా దూరంగా ఉంచినట్లయితే కేవలం తల్లి సన్నిధిలో ఉండడం అభ్యాసమైతే, ముందుముందు నిత్యమూ తల్లి చెంగు పట్టుకువొదలకుండా తిరగడం అలవాటైపోతుంది కొత్తవాళ్లని చూస్తే బెదురు, లోలోభయాలు అలవడతాయి

నడక వచ్చినతరవాత, పాపని అప్పుడప్పుడు బజారుకో, ఇరుగుపొరుగిళ్లకో తీసుకెళ్లడం మంచిది బట్టలు తొడిగినప్పుడు మురికిఅవుతాయని మట్టి పులుముకుంటాడనీ, భయపడకూడదు పరాయిఇళ్ళకి వెళ్లినప్పుడు వాడిని కనిపెట్టు కూర్చోపెట్టడం మంచిది కాదు. మిగతా పిల్లలతో కలిసి మెలిసి ఆడుకోనివ్వాలి. సిగరెట్టుపెకిలా అవ్వి ఏరబోతున్నప్పుడు తక్షణం లాగిపారేసి, ఇంకోవస్తువుమీదికి వాడి దృష్టిని ఆకర్షించాలి అంతే కాని అల్లరిచేస్తున్నాడని ఎక్కడికీ తీసుకుపోకుండా ఇంట్లో కట్టిపడేసిఉంచడం మంచిది కాదు దానివల్ల మానసికాభివృద్ధి లోపమౌతుంది

ముందుగా పాపమనసును కనిపెట్టాలి. తల్లిని అంటిపెట్టుకుని ఉండేవాడైతే గెంటెయ్యకూడదు కొత్తవాళ్లతో చనువు చేసి క్రమంగా స్వేచ్ఛ అలవాటుచెయ్యాలి కొందర్ని ఇంట్లో ఉంచితే ఖైదీలాగా బాధపడతారు. అటువంటివాళ్లకి తగినంత స్వేచ్ఛనిచ్చి పైన చూసీచూడనట్లు కనిపెడుతూఉండాలి.

[డా॥ బెంజామిన్ స్పాక్ గ్రంథం ఆధారం.]



అమెరికన్ బాంబరు విమానమొకదానికి ఆకాశంలో చాలా ఎత్తున ఒకటాంకర్ విమానం పెట్రోలును పంపుచేస్తున్నది. ఇది కొత్త పద్ధతి.



పశ్చిమ గోదావరి జిల్లా గవర్నమెంటు హెడ్‌క్వార్టర్స్ హాస్పిటల్‌లో గ్రామవైద్యుల శిక్షణ పొందినవారు డా ఎం ఓ ఆర్ ఎన్ కేశవన్, మిసెస్ ఎం సి హార్లీ, డాక్టర్ కె సుబ్రహ్మణ్యం అయ్యర్ గార్లు ముందువరుసలో కూర్చున్నారు



పాకిస్తాన్ పత్రికాప్రతినిధులు మే 2-వ ఢిల్లీ వచ్చినప్పుడు భారత పత్రికా ప్రతినిధులు స్వాగతమిచ్చిన దృశ్యం పాకిస్తాన్ ప్రతినిధి వర్గానికి నాయకత్వం వహించిన పాకిస్తాన్ పత్రికా సంపాదకుల సంఘాధ్యక్షుడు పీర్ అలీ మహమ్మద్ రషీదీ ఎడమనుంచి 4-వ స్థానములో వున్నారు. కళ్ళజోడు నగిషీ టోపీగలవారు అఖిలభారత పత్రికా సంపాదకుల సంఘాధ్యక్షుడు సి ఆర్. శ్రీనివాసన్.

గ్రా



ఫిలడెల్ఫియా (అమె
బడినవి. వీటిని శాస్త్రీ
8 ఏళ్ళలో సుమ



ప్రు డాక్టర్

★



త్రాలు

శ్రీ సి. రాజగోపాలాచారిగారికి ఢిల్లీలో స్వాగతము నెహ్రూ, పటేల్ గారు వారి కిరువైపుల గలరు.



కా) నుండి మద్రాసుకు 53 రైలు ఇంజన్లు రవాణా చేయ
ట్వన్ లోకోమోటివ్ వర్క్సువారు ఏర్పాటుచేశారు. గత
గారు 890 బాల్డ్విన్ ఇంజను ఇండియాకు పంపబడినది.



డచ్ రాణి జన్మదినోత్సవ సందర్భంలో మే 1-వ తేదీన, ఢిల్లీలోని
డచ్ రాయబారి, లాంపింగ్, విందుచేశారు. ఆ విందులో లాంపింగ్
సతిని ప్రధాని నెహ్రూ అభినందించుచున్న దృశ్యం.

సినిమాలేఖ :

## షావుకారు చిత్రం

# తెలుగుసినిమా పరిశ్రమ అభివృద్ధిచెందలేదా?



“అయ్యా!

ఆంధ్ర వారపత్రిక ఈ నెల 3వ తేదీ సంచికలో ప్రచురింపబడిన శ్రీకుమారదేవంగారి ‘సినిమాలేఖ’ చాలా చోద్యమైనది. ఆ లేఖలో తెలుగుసినిమాపరిశ్రమ ముందడుగు వేయలేదన్న విచారంకంటే శ్రీకుమారదేవంగారి సోద్వేగం సోత్కర్షత జాస్తిగా కన్పిస్తాయి.

వనక డి. యస్. కరకా యీ మాదిరి వ్యాసమే ఒకటి ఫిల్మిండియాలో వ్రాశాడు. తాను ఎన్నో ఏళ్లు హిందీఫిల్ములు చూడలేదనీ, చాలాకాలానికి బారువా తీసిన ‘అధికారి’ చిత్రం చూచాననీ, తను చిన్నతనంలో చూచిన చిత్రంకంటే ‘అధికారి’ చిత్రంలో నూతనత్వం ఏమీ లేదనీ, బారువా ఫ్రాంక్ కాప్రాలాంటి దర్శకులకు కొన్ని ఏళ్లు శుశ్రూష చేస్తేనేగాని ఫిల్ముల దర్శకత్వం చేసే అర్హత అతనికి కలుగదనీ ఆ వ్యాసంయొక్క సారాంశం. ఆ వ్యాసానికి పీఠికగా ఫిల్మిండియా సంపాదకుడు ముత్యాలవంటి కొద్దిమాటలు వ్రాశాడు. అవి సరిగా నాకు జ్ఞాపకం లేవుకాని వాటి సారాంశమిది. “ఈ వ్యాసానికి ఈ సంచికలో తావు యివ్వడానికి కారణం ఈ వ్యాసకర్త ‘ఐగోరస్’ అనే గ్రంథం వ్రాయడం మాత్రమే.” ఫిల్మిండియా ఆ వ్యాసాన్ని ప్రచురించడానికి ఆ కారణమైనా చూపించింది. శ్రీకుమారదేవంగారి లేఖను ప్రచురించడానికి ఆంధ్రపత్రికకు గల కారణాలేమిటో అవగతం కావడంలేదు.

“16 వేలఅడుగుల ఫిక్చరు క్లోరోఫారం లేకుండా ఎన్ని గంటల ఆపరేషన్ పొందినట్లు” శ్రీకుమారదేవంగారు ఎంత బాధపడినా మని వ్రాసినారో వారి లేఖను చదవడానికి ప్రయించుమించు మాకూ అంత బాధకలిగింది. ఆ లేఖలోని వాక్యపొందికను ఏమనిపొగడడం!

1936 తర్వాత తెలుగుచిత్రాలు చూడడం మాని తిరిగి 1950 అంటే 14 ఏళ్లతర్వాత ‘షావుకారు’ చిత్రం చూచారు శ్రీకుమారదేవంగారు మిత్రులబలాత్కారంవల్ల. చూచిన తరవాత వారికికలిగిన అభిప్రాయంఏమిటంటే తెలుగు సినిమాపరిశ్రమస్థితి “వేసిన గొంగళి వేసినచోటే వుంది” అని. ఇందుకు కారణంగా ‘షావుకారు’ చిత్రంలోని లోపాలను కొన్నింటిని ఉదాహరించారు. వారు చూపిన లోపాల్ని 3 రకములుగా విభజింపవచ్చు. (1) నిడివి విస్తారత (2) టెక్నికల్ లోపాలు (3) అజాతీయమైన సంగీతం. (1) చిత్రంనిడివినిగూర్చి మొదట విచారించుదాం. ఈ చిత్రంనిడివి దాదాపు 16 వేల అడుగులు. విజ్ఞానవంతమైన చిత్రం అంతకు తక్కువ నిడివిలో తీయడానికి అవకాశం వున్నమాట వాస్తవమేగాని పాశ్చాత్యచిత్రాలతో మన చిత్రములను పోల్చి ఏడువేల అడుగులలో చిత్రం ముగించవలె ననడం హాస్యాస్పదమే కాగలదు. కొన్ని సంవత్సరములలోనో నెలలలోనో జరిగిన సంఘటనలను ఏరి కూర్చి ఒక కథగా తయారుచేసి చిత్రం తీయవలసివచ్చినప్పుడు ఆ కథను అవసరమై నిడివి గల చిత్రంలో కూర్చగల అవకాశం ఎప్పుడూ వుంటుంది. అదే కథను 16 వేల అడుగులలో చెప్పవచ్చు. ముక్తసరిగా 7 వేల అడుగులలోనూ చెప్పవచ్చు. ఆ చెప్పడం ప్రేక్షకుల కోర్కెపైన ఆధారపడి వుంటుంది. 16 వేల అడుగులలో కథ చెప్పినందువల్ల చిత్రం పాడవుతుం దనడానికి కారణాలు లేవు. కథారస్తువునుబట్టి 11, 12 వేల అడుగుల నిడివితో తీసిన గొప్ప ఆంగ్ల చిత్రములూ గలవు. ముఖ్యంగా మన చిత్రములలో సంగీతం వుండితీరాలి. మనకు పుట్టితే సంగీతం, చస్తే సంగీతం, యీ మధ్యకాలమంతా ఏదోవిధమయిన సంగీతం వుంటూనే వుంటుంది. జీవితాలలో అంతటి ప్రాముఖ్యత వహించిన సంగీతమును విడిచిపెట్టి చిత్రం ఎలా తీయగల్గుతాము? తీస్తే ఆ చిత్రాన్ని ఆదరించే శ్రీకుమారదేవంలు ఎంతమంది వుంటారు? ప్రజాదరణ లేని పరిశ్రమ ఏమి వర్ధిల్లగలదు? 16, 17 వేల అడుగుల అరవ చిత్రాలు వచ్చి ఆంధ్రదేశాన్ని కొల్లగొట్టుతూవుంటే, విరిగిపడి ఆంధ్రప్రేక్షకజనం విస్తారమైన నిడివి గల చిత్రాల్ని ఆదరించి పోషిస్తూవుంటే ఆంధ్రచిత్రనిర్మాతలను ఆంగ్లచిత్రములవలె కొద్ది నిడివితో చిత్రములను తీయమనడం వారిని అక్షయపాత్రను పుచ్చుకోమనడంకంటె వేరు కాదు. నిర్మాతలు ప్రజల యిష్టానుబట్టి చిత్రములను నిర్మిస్తారుగాని ఆదర్శం పేరిట, చేతులు కాల్చుకోరు. ఈ రోజులలో శ్రీకుమారదేవంగారి “ఎజుకేటయిన ఆడియన్సులు” గుణసుందరి, బాలరాజులవంటి కాకమ్మ కథలను విరగబడి చూస్తూవుంటే ఏ నిర్మాత గుండెమీద చెయ్యివేసుకుని నిబ్బరంగా 7 వేలఅడుగుల ముక్తసరి చిత్రాన్ని తీయగలడు? 7 వేల అడుగుల చిత్రమే తీసితీరవలెనంటే *“Double attraction”* అని రెండు 7 వేల చిత్రాలు తీసి తారుమారు, భలేపెళ్లిచిత్రాలవలె ఒకేసారి ప్రదర్శించాలి. అది చౌ చౌ అయిపట్టున ఏ ఒక్క రుచీ పంటికి అందకుండా పోతుంది. 14 ఏళ్లుగా కొద్ది నిడివి గల ఆంగ్లచిత్రములను మాత్రమే చూచి చాలాకాలమునకు 16 వేల అడుగుల నిడివి గల తెలుగుచిత్రం చూచేటప్పటికి



కర్దార్ ప్రొడక్షన్స్ 'దులారీ' లో నాయికా, నాయకులు సురేష్, మధుబాల

శ్రీకుమారదేవంగారికి విసుగు జనించివుండవచ్చు ఆయనవలె కేవలం ఆంగ్లత్వం తక్కిన భారతీయులు, పొందియుండలేదు అందువలన మిగిలినవారికి శ్రీకుమారదేవంగారికి జనించిన విసుగు జనించియుండలేదు షావుకారుచిత్రాన్ని ఏ ఏడువేల అడుగులలోనో ముగించియుంటే 7 ఆటలతో ఆ చిత్రం ఆటముగిసేది చిత్రంనిడివి 16 వేల అడుగులనే 'ప్రెజుడిస్'తో చిత్రం తీసిన విధానంలో కృష్ణలీలలనాటి టెక్నిక్ లకంటే అభివృద్ధిలేదనడం కేవలం యథార్థతను విస్మరించడమే. 'కృష్ణలీలలు' 'మాయబజారు' యీ రోజుల్లోకూడా చెలామణీ అవుతున్నాయంటే దానికి కారణం యిప్పుడు వచ్చిన చిత్రాలు వాటికంటె అభివృద్ధికరమైనవి కాక కాదు. ఆంధ్రజాతి ప్రాతికమువ్యసనం పల్లెపట్లనే వుంది బస్తీ చేరి ప్రొద్దు గ్రుంకితే కాంప్లిమెంటరీలతో కాని నో మిగ్లెండులలో దూరడం లేదు. తోలుబొమ్మల ఆటలు, వీధి నాటకాలు చూడడానికి అలవాటుపడిన వారికి కృష్ణలీలలు కొంత వినోదం కల్పించక పోవు అంతమాత్రంచేత షావుకారు-చిత్రంతో కృష్ణలీలలను సరిపోల్చడం వింత కాగలదు. దానికి కారణం శ్రీకుమారదేవంగారి స్వాభిమానమే అయివుండాలి.

(2) చిత్రములో పెక్కు టెక్నికల్ లోపాలు వున్నాయన్నారు శబ్దం లాంగ్ షాటప్పటికీ షార్టుషాటప్పటికీ ఏమాత్రం తేడా కన్పించడం లేదన్నారు సంభాషణల టెంపోను అధికపరచడానికి కొన్ని చోట్ల ఆవిధంగా వుంచడం చిత్రమునకు చాలా అవసరం అవుతుంది అతివాస్తవికులకు నేపథ్యవాయిద్యమే గిట్టదు. కాని కథోద్వేగతను పెంచడానికి నేపథ్యవాయిద్యాలను ఉపయోగించడం ఆనవాయితీ అయింది కొన్నిచోట్ల ప్రత్యేక నేపథ్యవాయిద్యమునకు బదులు నేపథ్యంలో ఎవరో పాడిన పాటనో, వినిపించిన హరికథనో, గతంలో జర్గిన సంభాషణనో సంఘటనకు అనువర్తించేటట్లుగా వినిపించడం రివాజు అయింది ఆ పాటో మాటో ఎంతోదూరంలో ఉత్పన్నమైనప్పటికీ శబ్దాన్ని యినుమడింపజేసి వినిపించవలసివస్తుంది. ఈ విషయాన్ని విస్మరించి శ్రీకుమారదేవంగారు దీని నొక టెక్నికల్ లోపంగా ఎంచారు. ఫోటోగ్రాఫీ విషయంలో షావుకారులోని ఫోటోగ్రఫీకి కృష్ణలీలలనాటి ఫోటోగ్రఫీకి హస్తిమశకాంతరం వున్నది ఆనాటి వైపులు ఈనాటి చిత్రంలో వైపులతో పోలికకే రావు.

(3) సంగీతంవిషయంలో శ్రీకుమారదేవంగారికి కొన్ని విడ్డూరపు ఊహలున్నాయి చిత్రంలో తుమ్మెదపాటలు పెట్టివుంటే జానపదసాహిత్యసేవ జరిగివుండు నన్నారు ఏ పాట పాడించడానికైనా ఒక సందర్భం వుండాలి చాకలిదికూడా హిందీబాణీలో పాట పాడుతుందా అని విస్మయం పొందారు దేశంలో ఈరోజుల్లో ఏనోట వినినా హిందీబాణీపాటలే హిందీచిత్రాలు విస్తార ప్రచారం పొందడంవల్ల ఆ చిత్రాలలోని పాటలబాణీలు తేలికగా నేర్చుకోడానికి అవకాశం వున్నందువల్ల ఏరుపడితే వారు ముఖ్యంగా చాకళ్లు మొదలైన విద్యావిహీనులు పాటలను పాడడంలో వింత లేదు. శ్రవణానందమును చేకూర్చే గీతం ఏదైనా సంగీతమే కాగలదని నా అభిప్రాయం నాకు సంగీతంమీద అభిరుచి కేవలం వినడంవరకే నా శ్రవణానికి ... గంటల తరబడి బరువులు తీయించే శాస్త్రీయసంగీతంకంటె హృదయాన్ని కదిలించే భావోపేతమయిన మృదుమధురసంగీతమే హాయిని కల్పిస్తుంది. శాస్త్రీయసంగీతమును అర్థంచేసుకుని ఆనందించలేని బహుళసంఖ్యాకులలో నేనొకణ్ణి

హిందీబాణీలో పాడిన పాటలను కేవలం ఇమిటేషన్ సరుకని నేను త్రోసివేయలేను అనాంధ్ర మధురా ఆంగ్లచిత్రములలోని పోకడలు శ్రీ కుమారదేవంగారికి ఎంత ఇష్టమో ఆంధ్రచిత్రములలో ప్రవేశపెట్టబడుతున్న హిందీబాణీలు అదేవిధంగా చాలామందికి అంగీకారమవుతున్నాయి. అనాంధ్రమని ఇతరత్రా లభించగల మంచిని విడనాడుకోమనడం మలావ్ బుద్ధిని సూచిస్తుంది

మొత్తంమీద షావుకారు-చిత్రం ఈమధ్య వచ్చిన చిత్రములన్నింటికంటె చాలా బాగున్నదని చెప్పడానికి సందేహం లేదు ఈ చిత్రాన్ని ఆంధ్రజాతి ఆదరించికపోతే తెలుగువాళ్లకి తక్కువరకపు చిత్రాలే గతి

సి సీతారాం

---

# ధూమాసుర సంహారం



[ రోజర్ విలియమ్స్ రైసి ]

ఐరిష్ రిపబ్లిక్ స్వాతంత్ర్యవీరుడు డివెలరా గురించి ఒక చిన్నకథ చదివాను. బ్రిటిష్‌పాలకులు స్వాతంత్ర్యోద్యమాన్ని అణిచెయ్యడానికి ప్రయత్నించిన రోజుల్లో, ఈస్టర్ తిరుగుబాటు నడిపినందుకు డివలరాని అరెస్టు చేశారు. బ్రిటిష్ సిపాయిలు అతన్ని కారాగారానికి తీసుకుపోతుండగా తోవలో, "ఒక్క క్షణం ఆగండి" అన్నాడు. ఆగి, కాలుస్తూ కాలుస్తూ ఉన్న టొబాకో పైప్ తీసి నేలనేసికొట్టాడు. అదేమిటన్నారు సిపాయిలు. "మీవంటి నస్మరంతిగాళ్లు నా చేత ధూమపానం మానిపించారనే పరువు తక్కువమాటకి చోటివ్వకూడదు. అందువల్ల ఇప్పుడే స్వయంగా ధూమపానాన్ని త్యజించేస్తున్నాను" అని చెప్పాడు డివెలరా.

నేను కూడా అల్లా చేయకలిగిఉంటే! అనిపించింది నా మనసుకి. చిరకాలం నించి నిత్యాగ్నిహోత్రం అలవాటు నాకు. (అంటే రెండో అగ్గిపుల్ల వెలిగించనక్కర్లేకుండా, గొలుసుకట్టుగా ఒకదానివెంట ఒకటి నిప్పు ముట్టించుకుంటూ, సిగరెట్ల బారులు తగలబెట్టడం అన్నమాట.) పది నిమిషాల కొక శ్వేతకాష్ఠం చొప్పున దగ్ధం చేసి ఆయుఃపరిమాణాన్ని అదే ప్రమాణంలో క్షీణింపచేసుకుంటున్నాను. వీటి కోసం ఎంతఖర్చుపడ్డాను! ధూమపానం కోసం ఎంత ఖర్చుపెడుతున్నానో ఒకసారి లెక్కవేసుకు చూశాను. ఏడాది ఖర్చు చూసేసరికి నా కళ్లని నేనే నమ్మలేకపోయాను.

ఒకరోజు ఇల్లా కాదని నిశ్చయించేసుకున్నాను. "ఇదుగో. ఇల్లా చూడు. నీలో మగతనం ఏమన్నా ఉందా? నువ్వు మనిషివేనా లేక గొర్రెలమందలో చేరిపోయావా? డివెలరా ఎలా సాధించాడు? నువ్వు సాధించలేవా? ఏం" అని నన్ను నేనే నిలదీసి అడిగాను. అంతే. ఆ దెబ్బతో మానేశాను.

ఈవార్త నామిత్రులికి తెలిసింది. నా భీష్మప్రతిజ్ఞకి అట్టే నిర్ఘాంతపోయారు. వెంటనే వచ్చి నాదగ్గర వాలారు. నన్ను పరిపరివిధాల ప్రార్థించారు. "ఇంత ఘోర దీక్ష తీసుకుంటే, నక తట్టుకోలేవుసుమా. ప్రాణానికి ముప్పువస్తుందేమో" అన్నారు. "పోనీ మెల్లిమెల్లిగా తగ్గించెయ్యకూడదూ" అని సలహా ఇచ్చారు.

కాని ఈ బోధలూ హితవులూ నా తలకెక్కలేదు. ఇలా చెప్పాను. "అనేకులు నిర్జీవమానవులు ప్రత్యక్షంగా కనిపిస్తూనే ఉన్నారు. కొందరు కాఫీ అనంతరం ఒక సిగరెట్టు మాత్రమే కాల్చాలని స్వయంగా రేషనింగ్ పెట్టుకున్నారు. అలాగే నేనూ చిట్టచివరికి రోజుకొక్క సిగరెట్టువరకూ తగ్గించేశా ననుకోండి. అప్పుడేమౌతుంది? కాఫీ ఎప్పుడవుతుందా, భోజనం ఎప్పుడవుతుందా, సిగరెట్టు దేవత ఎప్పుడు ప్రత్యక్షమౌతుందా అని రోజంతా ధ్యాస దానిమీదే పెట్టుకుని కూచోవలసొస్తుంది. దాంతో అసలు ఏపనీ తోచకుండా పోతుంది. ఆఫీసులో ఒక్క కాగితం కదలదు. ఈ ఏకాగ్రతలో అన్యకర్తవ్యాలన్నీ స్తంభించిపోతాయి. సిగరెట్టు కాల్చే ముహూర్తం సమీపిస్తున్నకొద్దీ హృదయాందోళన ఎక్కువై తీరా కాల్చవొచ్చేసరికి స్పృహ తప్పి పడిపోవచ్చు కూడా. అబ్బే ఇదేమీ లాభంలేదు. డివెలరా ఎలా జయించాడు? అంతే. అదొక్కటే మార్గం. అన్యమార్గం లేదు."

నా వాదాన్ని మిత్రులికి ఒంటబట్టించడంకోసం దయార్ద్రహృదయుడైన ఒక మానవవ్యక్తి సంగతి వారికి చెప్పాను. ఉన్నట్టుండి ఒక్కసారిగా తోక మాయమైతే తన కుక్క బెంగటిల్లిపోతుందనే దాక్షిణ్యభావంతో రోజుకి అంగుళం చొప్పునమాత్రం తోక కత్తిరించాలన్నాడు ఆ వ్యక్తి. అలాగుందన్నాను మిత్రుల హితబోధ.

ఇది జరిగి మూడేళ్లయింది. ఆనాటినుంచీ నేను సిగరెట్టు తాకలేదు. మొట్టమొదట నన్నుచూసి నా మిత్రులు కంటగించుకునేవారు. తాగుడు మానేసినవాడు తాగేవాళ్ల దగ్గిర కెళ్లి వాళ్ల చేతుల్లో గ్లాసులు పడగొడుతూపోతూ నీతి లెక్చర్లు దంచుతోంటే తాగేవాళ్ల కెల్లా ఉంటుందో నామిత్రులి కల్లా ఉండేది. "ఏమిట్రా వీడి గొప్ప" అన్నట్టు చూసేవారు.

"మీ రనుకుంటున్నది పొరపాటు. ఇదేం బ్రహ్మవిద్యకాదు. మీరు కూడా మానెయ్యగలరు" అని చెప్పేవాడిని. నా చెప్పే ఫక్కీ చూస్తే బహుశా "ఓరి వెర్రినాయన్న, బుర్రలేదేమిరా. బలే అవకాశం వస్తే ఉపయోగించరేం" అన్నట్టుండేది కాబోలు.

రోజులు గడిచినకొద్దీ "పోనీలే పాపం" అనిపించి వాళ్ల మానన వాళ్లని వొదిలేశాను. నన్ను కొందరు జాలిగా అడిగేవారు, "పాపం. నిజంగా నువ్వు చాలా హింసపడిఉండాలి." ఆ సమయంలో వాళ్లని చూస్తే నాకు జాలేసేది. "నా జన్మలో అంత బాధనే చూళ్లేదు. ఎద్దుపుండంటే కాకికూడా అంత బాధపడి ఉండదు." అని సమాధాన మిచ్చేవాణ్ని.

మూడేళ్లయిన తరవాత ఇవాళ నేను నిజం చెప్పెయ్యవచ్చు. నిజంగా ఏబాధా కలగలేదు. ఈపనికి ఏ అతీతమైన ఆత్మసంయమనబలమూ అవసరంలేకపోయింది. ఎవరైనాసరే సులువుగా చెప్పెయ్యగల పని ఇది నా మిత్రులితో చెప్తున్నాను. "మీరు ధూమపానం ఇట్టే మానచ్చును—మీకే నిజంగా ఆ తలపు ఉంటే."

ఇందులో ఉన్న చిదంబరరహస్యం ఒకటి అర్థంచేసుకోవాలి. ఇక్కడ పొగ తాగడం తాక్కపోవడం అనే ప్రశ్న ముఖ్యంకాదు. పొగ తాగాలనే "కోరికని" కసిరి, దాని నోరు మూయించడం ముఖ్యం అనే విషయాన్ని గ్రహించాలి. ఇదేమీ లేదు. తనకి తానై ప్రయత్నించి ఒక భావం యొక్క మైకంలో పడిపోవడం (సెల్ఫ హిప్నాసిస్) అంటే నీలో నువ్వు ఈ కింద విషయాల్ని ఈరీతిగా ఆలోచించుకోవాలి. "నేను పొగతాగడం మానెయ్యాలి. ఇది ఒట్టి

(33-వ పేజీ చూడుడు)




# మిత్రద్రోహి

శ్రీ మద్దులవారి రామకృష్ణ

అనగా ఆనగా ఒకఊళ్ళో గోపీ అనే అబ్బాయి ఒకడు ఉన్నాడు. వాడు సోమరి. పోకిరి. వాడికి ఎవ్వరూ స్నేహితులు లేరు. ఎందు చేతనో వాడి కెవ్వరూ ఆటగాళ్ళు కాలేదు.

ఒకరోజున స్నేహితుణ్ణి ఎవరి నైనా వెతుకుదామని బయలుదేరి వెళ్ళాడు గోపీ. పోగా పోగా ఒక కుందేలు కనపడింది. "నాతో ఆడుకుంటానికి వస్తావా? అని అడిగాడు కుందేల్ని గోపీ." సరేనంది. ఇద్దరూ కలసి కొంతదూరం పోతూ ఉన్నారు. ఇంతలో ఒకవేటకాడు ఎదురుపడ్డాడు. భయంతో గడగడా వణుకుతూ ఒక దుబ్బులోకి గబగబా దూరింది కుందేలు. వేటగాడు "అబ్బాయీ! నువ్వేమైనా ఒక కుంధేల్ని చూశావా?" అన్నాడు. "ఆఁ. ఇక్కడనే, ఈ పొద లోనే". అన్నాడు గోపీ. వేటగాడు వెంటనే తుపాకి భారుపెట్టి కాల్చాడు అప్పుడే. మరొక పొటికి మెల్లగా జారుకుంది ఆ కుందేలు.

ఇక ఒంటరిగా ఉన్నాడు గోపీ, తిరిగాడు, తిరిగాడు, పొద్దు వాటార పోయినదాకా. చలి గడగడ వణికిస్తున్నది. పట్టరానంత ఆకలి అగుతున్నది. ఒక పెద్దచెట్టుకింద ఏడ్చి ఏడ్చి గుడ్ల నీళ్లు కుక్కుకుంటూ కూలబడ్డాడు విచారంతో భయంతో. చెట్టుతొర్రలోనుంచి ఒక ఉడుత బయటికొచ్చి "ఏమ్ అబ్బాయి! ఏం చేస్తున్నావిక్కడ ఒంటరిగా ?" అన్నది. నేను ఒక చెలికాని కోసం వెతుకుతున్నాను అన్నాడు గోపీ. "ఐతే నేనే నీ చెలికాడుగా ఉంటా" అన్నది ఆ ఉడుత. సరేనన్నాడు.

స్నేహం కుదిరింది అప్పుడే. వాళ్ళిద్దరూ కలసి ఎన్నో కొత్త ఆటలు ఆడుకొన్నారు. "నీవు ఎక్కడికీ వెళ్లవద్దు. మాయింట్లోనే ఉండు. మన మిద్దరమూ ఒక కంచంలోనే తిని ఒక పక్కమీదే పడుకొంటాం దాము. మన మిద్దరమూ ఎప్పుడూ ఆడుకొంటూ ఉందాము. రాత్రిళ్లు కథలు చెప్పుకొందాము. ఏం?" అన్నది ఉడుత. సరేఅన్నాడు గోపీ. ఉడుత అమర్చిపెట్టిన విందు ఆరగించారిద్దరు. తిని సుఖంగా నిదరపోయేందుకు ఆకులతో మెత్తటి పక్క తయారుచేసి పడుకోమన్నది గోపీని. తెల్లవారకముందే పెందలకడనే, ఉడుతకన్నా ముందే మేలుకొని గూట్లో ఉన్న తినుబండారాలన్నీ మూటకట్టుకొని చెప్పకుండా వుడాయించాడు గోపీ.



అడవిలో పోయి పోయి ఒక ఎలుగుగొడ్డును సమీపించాడు గోపీ. "ఎక్కడికి పోతున్నావోయ్! కుర్రాడా!" అన్నది ఎలుగుగొడ్డు. "సావాసగాడికోసం. నీవు నాతో స్నేహానికి వస్తావా?" అని అడి

గాడు గోపీ, సరేఅన్నది. ఇద్దరూ కలసి కొంతదూరం పోయారు. అంతలోనే తోడేళ్లువెంబడించాయి. గోపీ భయపడ్డాడు. కాపాడమన్నాడు ఆ ఎలుగుగొడ్డును. వీపు మీద ఎక్కమంది. శక్తికొద్దీ పరుగెత్తింది. నోటివెంట నురుగులు పడుతున్నవి. నాలుక బయటపడ్డది. ఒళ్లుఅంతా చెమట ముద్దయిపోయింది. తోడేళ్లనుంచి బయటపడ్డారు మిత్రులిద్దరూ. నడిచి నడిచీ ఒక అత్తిచెట్టుకింద కూలబడ్డారు. డస్సిపోయిందా మృగం. "నిదరపోతాను" అన్నది. కొంతసేపు జాగ్రత్తగా ఉండమంది గోపీని. ఊరకుండలేక బొడ్డులోని పిల్లనగ్రోవి తీసికొని ఊదుతున్నాడు గోపీ.

అంతలోనే ఆదారిన పోయే ఒక ముసలిఅవ్వ "ఈ చచ్చిపోయిన ఎలుగుగొడ్డు ఎవరిది? చర్మము అమ్ముతావా? అని అడిగింది." అమ్ముతా. డబ్బు యిచ్చి తీసికొనిపో అన్నాడు గోపీ. డబ్బు గలగలా లెక్కపెట్టి ఇచ్చింది. నిదరపోతున్నట్లు నటిస్తున్న ఎలుగుగొడ్డు ఈ దురాలోచన విని వెంటనే వురికిందా నట్టడవిలోకి.

తిరిగి ఒంటరిగా డయ్యాడు. చీకటి పడ్డది. తోడేళ్లు భయంకరంగా అరుపులు అరుస్తున్నవి. భయం, ఆకలి, చలితో ఏడుస్తూ కూరుచున్నాడు గోపీ. ఏడ్పు విని దాపున ఉన్న బొరియలోనుంచి బయటికి వచ్చింది ఒక ముండ్లపంది. "ఏమిటి చెప్మా ఈ యేడుపు" అని అడిగింది. "నాకు ముగ్గురు స్నేహితులు ఉన్నారు. వారు అందరూ నన్ను వదలి వెళ్ళారు. అందుకని ఏడుస్తున్నా" అన్నాడు గోపీ. ఏడుపు మాన్పించుదామనుకొని నీలో ఏదైనా తప్పు లేకుంటే వాళ్లు నిన్ను ఎందుకు వదలివెళ్లారు? నిజం చెప్పితే సాయపడతాను అంది ముండ్లపంది. జరిగింది జరిగినట్లు చెప్పాడు. జవాబేమీ చెప్పకుండా కిమ్మనకుండా ముడుచుకొనిదూకింది ముండ్లపంది వెంటనే బొరియలోకి.

బాలానందం :

# అల్లుడు

ఒక వూళ్ళో ఒక వకీ లుండేవాడు. అతనికి లలిత యను కూతు ర్నుం డినది. ఆమెకు పెళ్ళియీడు వచ్చింది. పెళ్ళి చెయ్యా లనుకున్నాడు. కాని కట్నాల సంగతి పెద్ద చిక్కై తగుల్కుంది. స్కూల్ ఫైనల్ ప్యాసయితే రెండువేలరూపాయలు; బి. ఏ. ప్యాసయితే ఆరువేలరూపాయలు. ఈ కట్నాలతో పడలేమనుకొని చదువురాని ఒక చక్కటి అబ్బాయి కిచ్చి వివాహం చేసినాడు.

వకీలుగారికి కొంత దిగులు దిగజారింది. 'ఇంక మనము నిశ్చింతగా యుండవచ్చు' ననుకొన్నాడు. కాలం కలిసిరాకుంటే క్రర్రయైనా పామై లేచి ఎగిరిపడుతుందట. వేలకు వేలు ఫీజులు గుంజే వకీలు, అంత మాత్రము వరకట్నం ఇవ్వలేడా? అటువంటి లోభులకు కాల మెట్లా కలిసివస్తుంది!

అల్లుడు వట్టి మూర్ఖుడు. ఎవ్వరెల్లా చెపితే అది చేస్తాడు. ఇటువంటి అల్లుడి నడత మామగారి గౌరవానికే భంగం తెస్తుండేది.

ఒకనాడు మామగారు కోర్టుకు వెళ్ళారు. అల్లుడు ఇంట్లోనే యున్నాడు. అప్పుడు వకీలు భార్య కూతురితో యిలా అంది; "చూచేవుటే! మీ నాన్నగారికి ఎప్పుడూ కోర్టులోనే పని; ఇంట్లో సంగతులు ఆయనకు పట్టవు. ఈవేళ యింట్లో ఉప్పులేదు. ఇంట్లోనా, అల్లుడు వచ్చివుండిరి......" అని.

ఈ సంభాషణ అల్లుని చెవిలో పడింది. ఆతడు వెంటనే లేచి కోర్టు కెళ్ళాడు. కోర్టులో మామగార్ని చూసి "ఏమండీ! ఇంట్లో ఉప్పు లేదట. అత్తగారు విసుక్కుంటున్నారు......" అని ఇంకా ఏదో చెప్పబోయాడు.

మామ వెంటనే బయటికి వచ్చి, కోర్టుకు దూరముగా అల్లుని తీసికొని

**శ్రీ ఐ. లక్ష్మీకాంతశర్మ**

వెళ్ళి, "అబ్బాయీ! ఇంతమాత్రానికే కోర్టుకు రావలెనా? అటువంటి చిన్నసంగతులు కోర్టులో చెప్పవచ్చునా! వర్తకుడింటికి, కోటడిని డబ్బులిచ్చి పంపిచ్చు. ఇదిగో, యీ బేడ తీసుకొనివెళ్ళు," అని నయంగా చెప్పాడు.

ఇంకోనాడు వకీలు కోర్టులో నుండగా పశువులకొట్టము తగులబడింది. భార్య, అత్త చేరి అల్లుడ్ని కోర్టుకు పంపించారు. అతడు నెమ్మదిగా వెళ్లి మామగారిని రహస్యంగా ఇవతలకు పిలిచాడు. కోర్టుకు దూరంగా తీసికెళ్లి సావకాశంగా కూర్చున్నతరువాత "మన, పశువులకొట్టాం తగులబడిపోతున్నదండీ; మీరు......అని యింకా ఏమో చెప్పబోయాడు.

"ఏమిటీ! కొట్టాం తగులబడిపోతోందా? ఇటువంటిసమయంలో ఇలాగా చెప్పడం? త్వరగా వచ్చి నాతో చెప్పగూడదా," అంటూ ఇంటికి పరుగెత్తిపోయ్యేసరికి కొట్టం పూర్తిగా కాలిపోయింది.

ఇంకొకనాడు అల్లుడు మరల కోర్టులో అగుపడినాడు. మామ వెంటనే వెలుపలికి వచ్చాడు. అల్లుడి కళ్ళవెంట నీళ్ళు కారిపోతున్నై. "ఏమి, నాయనా! ఏమయింది? చెప్పు, చెప్పు, త్వరగా చెప్పు, ఊఁ..." అని అడిగాడు. అల్లుడు ఏడుస్తూ యీలా సమాధానం యిచ్చినాడు. "ఈవేళ లలిత పుష్పవతి అయిందట. నేను వెంటనే పరుగెత్తివచ్చాను..."

"అరు ఇదేం విపరీతము నాయనా పుష్పవతి అగుట అభిమతమేకదా! దీనికి ఏడ్వటం ఎందుకు సంతోషంతో వచ్చి చెప్పక ఇంకెప్పుడూ ఇలా ఏడుస్తూ రాకు అని చెప్పి ఇంటికి తీసికెళ్ళాడు.

కొన్నిదినములైన తర్వాత మామగారి అమ్మ జబ్బునపడింది. "ఇప్పుడో ఇంక కాసేపటికో, అనే

(31 వ పేజీ చూడుడు)

# ★ అలవాట్లు ★

(చిన్నకథ)

చి. మందపాటి జయప్రద

అనగా అనగా ఒకచోట ఒక ఒంటె ఉండేది. ఆ చుట్టుప్రక్కల్లోనే ఒక జిత్తులమారి నక్క కూడా ఉండేది. ఇవి వుండేచోటికీ ఊరికీ, ఒక పెద్ద ఏరడ్డముంది. స్మశానం కూడా ఆ ఏటి అవతల ఒడ్డునే ఉంది. అందుకని నక్కకు ఇటువైపు ఆహారం దొరికేది కాదు. ఆ ఏరు ఎప్పుడూ ఎడతెగక పారుతూనే వుండేది. ఏరు ఈది దాటాలంటే భయము! ఏం జేస్తుంది?

అప్పుడప్పుడు ఒంటె దగ్గరి కొచ్చి కబుర్లు చెప్పుండేది. మెల్లి మెల్లిగా మంచి చేసుకుని కొద్దిరోజుల్లోనే ఒంటును ఆప్తమిత్రుడ్ని చేసుకుంది. ఒక రోజు ఇద్దరూ షికారుకని బైలుదేరారు. నక్క ఒంటెని ఏటి ఒడ్డుకి తీసుకపోయింది. "అవతలొడ్డున ఎంత మంచి చెరుకుతోటలున్నా యనుకున్నావ్?" అంటూ ఒంటెకు నోరూరించింది. నిజంగానే స్మశానం పక్కవే, ఎత్తుగా దట్టంగా పెరిగి మంచి ఏపుమీ దున్నాయి ఆ ఊరివారి చెరుకుతోటలు. ఒంటె కన్నులపండువుగా చూచింది. చూస్తుంటేనే తిన్నట్టనిపించింది దానికి. వంకరమెడ ఇటూ అటూ తిప్పుకుంటూ, ఆనందం పెదిమలు చప్పరించుకుంటూ దొరికిన గడ్డి కొరకడం కంటె, దానికేం తెలుసు పాపం ఎక్కడేమున్నాయో!

నక్క ఒక ఉపాయం చెప్పింది. "ఇద్దరం రాత్రిపూట బైలుదేరి ఏరు దాటుదాం. నీ వీపు మీదెక్కి కూచుంటాను నేను. అక్కడి కెళ్ళాక తోటలోకి దారి చూపిస్తా నీకు. నీ ఇష్టంవచ్చినట్లు తిను. ఇవతల నా పని నేను చూసుకుంటాను. మళ్ళీ ఇద్దరం కలిసి వచ్చేద్దాం!" "అమ్మో! నేను మునిగి పోనూ?" ఒంటెకి భయ మెక్కువ. "నేను దారి చూపిస్తాగా! లోతు తక్కువున్నచోట్లు నాకు తెలుసు." అంది నక్క. ఎట్లాగైతేనేం ఒప్పించింది ఒంటెని. సంతోషంతో తల ఎగరేసింది ఒంటె.

ఆ రాత్రే బైలు దేరాయి రెండూ. నక్క ఒంటెవీపుమీదెక్కి మూపురం గట్టిగా పట్టుకుంది. ఒంటె ఏరుదాటి చెరుకుతోటలోకి దూరింది. నక్క తన తిండికోసమని వెళ్ళి వచ్చింది. చింతచెట్లలోంచి గాలి రివ్వుమంటూ వీస్తోంది. అప్పటికే అర్ధరాత్రి దాటిపోయుంటుంది.

నక్క కడుపునిండా మెక్కింది. ఒంటె పొట్టకూడా మొయ్యలేనంత భారమైపోయింది. అయినా వెనకా ముందూ చూడకుండా విరుస్తూనే వుంది చెరుకుగడలు. నక్కకేమీ తోచలేదు. జిత్తులమారి నక్క కానే పాలోచించింది. ఉన్నట్టుండి తోటదగ్గరగా పోయి పెద్ద కూత పెట్టి, ఒక చెట్టుతొర్రలోకి పోయి దాక్కుంది. ఇది విని కాపలావాళ్లు ఉలిక్కిపడి లేచారు. లేవగానే చెడ మేస్తూ ఒంటె కనిపించింది. దుడ్డుకర్రలు తీసుకుని పాపం ఒంటె నడుం విరిగేట్టు బాదారు. ఏటి ఒడ్డుకి ఒక్క పరుగు తీసింది ఒంటె. అసలే వళ్ళు బరువు, అందులో వీపుమీద దెబ్బలు! ఒంటె పనెట్లా ఉండాలంటే అట్లా ఉంది. నక్కమీద బలే కోప మొచ్చింది. ఏటిఒడ్డునే కాచుక్కూచుంది, నక్క లోపల్లోపల నవ్వుకుంటూ.

"ఏం నక్కా ఇట్లా చేశావ్?" అంది ఒంటె కోపంగా. "అది గాదు బావా! నాకుంది చూశావ్, కడుపు నిండగానే అట్లా కూతపెట్టడం అలవాటు. ఇట్లా అవుతుం దనుకో లేదు సుమీ? రేపట్నుంచీ దూరంగా పోయి కూస్తాలే." అంటూ ఒంటెవీపుమీది కెక్కింది. "ఓహో! అట్లానా" అంటూ ఒంటె నీళ్ళల్లోకి దిగింది.

"ఏం పోయింది లెద్దూ? శుభ్రంగా ఇద్దరమూ కడుపునిండా తిన్నాం ఇంక మూడురోజులదాకా తిండ క్కర్లేకుండా!" ఒంటెని బుజ్జగించింది నక్క. "దానికేం లే నక్క బావా! పొట్ట నిండాక నాకూ ఒక అలవాటుంది-ఒకసారి ఇటూ అటూ పొర్లడం?" అంటూనే ఏటిమధ్య పొర్లిగింతలు పెట్టింది ఒంటె. ప్రవాహంవిసురులో పడి నక్క కాస్తా కొట్టుకుపోయిందందులో!

---

# "ఇవాళ మాస్టారు రారు—"



[ఒకబడి. మధ్యాన్నం పావు తక్కువ మూడయింది, వొక క్లాసు. దాన్నిండా ఆడ, మగ పిల్లలు. అంతా 12, 13 ఏళ్ల వాళ్లు. ఒక్కొక్కళ్లూ వొక్కో-మూలకి పోయి కొందరు చదువుకొనేవాళ్లూ, కొందరు రాసుకునేవాళ్లూ, హస్కు-కొట్టేవాళ్లూ, కునికేవాళ్లూ అంతా వున్నారు. మేస్టారికుర్చీకి దగ్గిర్లోనే గోపాలం వున్నాడు చదువుకుంటూ. ఇంకా గంట కొట్టలేదు కాబట్టి మేస్టారు రాలేదు. అంతా గందరగోళంగా వుంటుంది. బుచ్చిబాబు వొచ్చేడు. చంకలో పుస్తకాలు. తిన్నగా గోపాలందగ్గిరి కెళ్లి, అతని చేతిలో పుస్తకం వూళ్లాగి కిందికి కొడతాడు.]

గోపా: ఇదేంట్రా? నా పుస్తకం నేలకేసి కొడుతున్నావ్? చదవనివ్వవేం?

బుచ్చి: ఇంకా చదువేంటి? ఈపూట మేస్టారు రారు—తెలుసా?

గోపా: రాకపోవటమేం? ఈపూటకి పద్యాలు చదువుకు రమ్మనలేదూ?

బుచ్చి: అవును—ముందు రమ్మన్నారు. ఇప్పుడూ ఆయనే రానన్నారు.

గోపా: నీతో చెప్పేరా రానని?

బుచ్చి: ఊఁ! బడికొస్తున్నప్పుడు అలాగే మేస్టారింటికి వెళ్లేను. "మేస్టారూ" అని పిలిచేను. ఇంతలో మేస్టారిభార్య ఏమందో తెలుసా? 'మేస్టారు ఈపూట రారు' అంది ఇకనేం అని తుర్రున వొచ్చాశాను.

గోపా: ఏడిసినట్టేవుంది. ఆవిడ చెప్పడమూ సరే. ఇతను రాకపోవడమూ సరే!

బుచ్చి: లేదురా! నా మాట నమ్మవా? కాకపోతే మన రవణయ్య నడుగురా-ఏంరా రమణయ్యా (రమణయ్య వోమూలనుంచి వొస్తాడు) మేస్టారు ఈపూట రానన్నారుకదూ?

రమ: ఈ పూటేం? రేపూ రానన్నారు—

బుచ్చి: విన్నావా? నా మాట నమ్మేవుకావు—

గోపా: ఎంచేత రారో? వొంట్లో బాగులేదోఏమో!

బుచ్చి: అదంతా మన కెందుకు?

**శ్రీ రావికొండలరావు**

మేస్టారు రారు—మనం ఈపూట చదవక్కరలేదు— (అలా వెంకట్రావుదగ్గిర కెల్తాడు. వెంకట్రావు *E-V-E-N-I-N-G-* 'ఈవెనింగ్' అని వొకటే బట్టీవేస్తున్నాడు.) వెంకట్రావ్! ఏమిట్రా'య్? ఇంత శ్రద్ధగా చదువుతున్నావ్ మేస్టారు రారనా?

వెంక: (పుస్తకం కింద పారేసి) రారూ—రారూ? హాయ్ హాయ్!

బుచ్చి: రారా వెంకూ! తోట కెల్దాం!

వెంక: ఏ తోటకి?

బుచ్చి: అచ్చన్నగారి తోటకి—వాళ్ళ బంట్రోతు లేడూ—ఇవాళ తోట కొస్తే కావలిసినన్ని తియ్యమామిడికాయలిస్తానన్నాడు.

(ఇద్దరూ మళ్లీ గోపాలం దగ్గిరకి వొస్తారు)

బుచ్చి: గోపాలం! పదరా పోదాం తోటకి—

గోపా: నేను గోళీ లాడుకుందాం అనుకుంటున్నాను. మొన్న ఆ కిష్టిగాడు నన్ను అన్నీ వోడించేశాడు. ఇవాళ అన్నీ నేను లాగెయ్యాలి!

బుచ్చి: పోసి—మరో నాడు శలవునాడు, ఆడుకోవొచ్చులేరా!

గోపా: అబ్బే! ఇవాళే ఆడాల్రా (ఇంతలో మూలల వున్న పిల్లలంతా గోపాలంచుట్టూ గుంపుగా చేరి)

పిల్లలు: బుచ్చీ ఈపూట మేస్టారు రారూ (గట్టిగా)

బుచ్చి: అబ్బబ్బబ్బబ్బ...బ్బ! రారు— ఈపూట మేస్టారు రారు రారు—రారు!! (అందరూ 'బలే' అని కేకలు)

వెంక: వొరేయ్! ఇవాళ బుధవారం కదూ? మన సెట్టిగారి సత్రవులో గారిడీరా! ఎంత బావుంటుం దనుకున్నావ్—వొరేయ్! పెద్దపెద్ద పాములు—అంతంత పాములు—బుస కొడుతూంటే—అబ్బ! వెళ్దాం పదరా!

గోపా: (విసుగ్గా) అది చూసిన గారడీయేరా!

వెంక: చూస్తే నేం? ఒకసారి చూస్తే నరా? ఇంకా చూడాలనే వుంటుంది!

బుచ్చి: ఏం గారిడీరా? హాయిగా మావిడికాయలు తినక?

వెంక :తీరా వెళ్లేక — వా డివ్వనంటే?

బుచ్చి ఎందు కివ్వనంటాడూ? నాతో ఇస్తానని చెప్పి!

గోపా: (సరదాగ్యాన్నంగా) వారేయ్! మేస్టారు ఈపూట ఇంగ్లీషు చదవనివాళ్లకి ఎముకలు ఏరేస్తా నన్నారు—ఏం తప్పిందిరా?

బుచ్చి అంతేరా! ఈ రోజు మనకి భగవంతుడు "మామిడికాయల ప్రాప్తి" అని రాయిస్నేడు—దేవుడి మాటకి తిరుగుంటుందా చెప్పూ!

(ఇంతలో వాకుర్రాడు పరుగెత్తు కొచ్చి)

కుర్రాడు బుచ్చీ బుచ్చీ! బీచిలో వోపెద్ద ఆకాశంఅంత చేపని పట్టేర్రా ఎంత పెద్ద దనుకున్నావ్?

బుచ్చి ఏం చేప?

కుర్రాడు చేప కాదురా! అదేదో పేరు చెప్పేరు (ఆలోచిస్తు) బూంగరం. ఏదో అన్నార్రా! (అంతా నవ్వుతారు)

బుచ్చి (వాడిబుర్రమీదవొక్క టి చరిచి) బూంగరంఏంట్రానీ నెత్తి!

కుర్రాడు (బుర్ర తడువు కుంటూ) బూంగరమో మింగరమో ఏదో అన్నార్రా అబ్బ ఎంతుంది?

గోపా వోహూ! తిమింగిలం అవుంటుందిరా!

కుర్రాడు ఆఁ ఆఁ! తిమింగిరమే తిమింగిరమే!

బుచ్చి తిమింగి 'రం' ఏంటి? తిమిం 'గి' లం—

కుర్రాడు ఎంత పెద్దది? ఆకాశం అంత పెద్దది! చూదాం పదరా!

గోపా ఏంరాచూద్దామాబుచ్చీ?

బుచ్చి అదెందుకురా? మొన్న మ్యూజియం లో చూసిందేగా! పదరా మామిడికాయలు పోతాయ్! వారే—ఆ తోటలో వి ఏం కాయల్రా! అమృతం అనుకో— పంచదార పాకంపట్టి అందులో పోసేరా అనిపిస్తుంది—ఎంత తీపి? (నాలిక చప్పరిస్తాడు)

కుర్రాడు ఆకాశం అంత తియ్యగా వుంటాయా?

(అప్పటికప్పుడే పుస్తకాలన్నీ విర జిమ్మివుంటాయి క్లాసులో ఇద్దరు, ముగ్గురు బొంగరాలు తిప్పుకుంటు న్నారు. చాలామంది బయటికి పోయేరు—మిగిలింది గోపాలం— వెంకట్రావు—బుచ్చీ మరోదూనా)

బుచ్చి పదరా వెంకూ పోదాం! ఏంరా గోపాలం రావా?

గోపా అది కాదు మామిడి కాయలకి రానా? తిమింగిలం చూణ్ణా గారిడీ చూణ్ణా—గోళీ లాడనా? అని ఆలోచిస్తున్నాను

బుచ్చి ఏడిసినట్టేవుంది! ఇవన్నీ ఎప్పుడేనా చూసుకోవచ్చు! పద మామిడికాయలు పోతాయ్!

(ఇంతలో గణగణమని గంట వాగు తుంది మేస్టారు వొస్తారు. కుర్చీలో కూచుంటూ)

మేస్టారు ఏర్రా? మిగిలిన గుంట లేరీ?

వీళ్లంతా సగం చచ్చి వొకళ్ల మొహాలు వొకళ్లు చూసుకుంటు న్నారు)

గోపా బబబబ బ. బయి టికి పోయారం. డి!

మేస్టారు (కోపంగా) పోయారూ రానీ—తొక్క తోలిచేస్తాను ఊఁ తియ్యండి—పాఠాలు తీసి వొప్ప జెప్పండి!

(ఎవరూ తియ్యకుండా తెల్ల మొహాలు వేసుకుంటున్నారు బుచ్చిగాడు మనస్సులో 'మామిడి కాయలు' అని గొణుక్కుంటు న్నాడు.)

మేస్టారు (కోపంగా) ఏం? ఇంకా తీసేరా లేదా?

మెల్లిగా పుస్తకాలు తీస్తున్నారు)

తెర పడిపోయింది



లండన్ సేవాయ్ హోటల్లో యాత్రికుల విందు. జర్మనీలోని అమెరికన్ హైకమిషనర్, జాన్ జె మాక్లాయ్, మాంట్‌గోమరీని కలుసుకుని కరచాలనం చేస్తున్నారు.

# రుద్రమదేవి

(11-వ పేజీతరువాయి)

రుద్రమ్మ గదిలోనికి వచ్చుచుండగనే, ఆమెదృష్టి యావల వనములో చింతాక్రాంతుడై తిరుగుచున్న యన్నమంత్రిపై బడినది. మెరపు మెరసిన ట్లామెకు ఏకశిలపై జరిగిన స్వల్పవిషయములు భాసించినవి. ఇన్నాళ్లు రుయ్యమచిత్రప్రవర్తనమునకు కారణమును, ఇప్పటివరకు నది పాడుచున్న పాటల యర్థమును, ఈ పట్టరాని దుఃఖముస్వభావమును, రుద్రమ్మ కొక్కసారిగా తెలియవచ్చినవి.

"అమ్మాయీ, ని న్నెంత వ్యథపెట్టినానే, తల్లీ!" ఇట్లను చున్న రుద్రమకే కన్నీటిబొట్లు విశాలనేత్రములలో మిలమిలలాడెను.

"నీ వేమి చేసినా వమ్మా!" అనుచు మరల రుయ్యమ్మ వెక్కి వెక్కి యేడువసాగినది.

ఆ తల్లికి బిడ్డకు ఎక్కువసంభాషణ జరగలేదు. వారికి ఒండొరులకు, ఒండొరుల భావములు ఒకరిచూపులతోడనే ఒకరికి, నోటితో చెప్పినకంటె స్పష్టముగా వ్యక్తము లయ్యెను. ఎన్నాళ్లు చెప్పికొనిన వారి హృదయాంతరభావములు వ్యక్తము లగును?

కొంతతడవునకు రుద్రమ్మ లేచి సమీపమున గల భూర్జపత్రమును తూలికయు దీసికొని యం దిట్లు వ్రాసెను.

"మా ప్రియతనయ రుయ్యమ్మకు అనుగ్రహించిన యాజ్ఞాపత్రిక."

నీ యిచ్చవచ్చినప్పుడు ఈ పత్రిక గొని ఇందులూరి అన్నమంత్రీశ్వరులకు సర్వస్వాతంత్ర్యము కలిగించి పూర్వపదవిలో ప్రతిష్ఠాపించుటకు ఇందుమూలముగా నీకు సర్వాధికారము నొసంగుచున్నాను.

(ముద్రిక) శ్రీ రుద్రదేవమహారాజు.

ఆ పత్ర మొకమారు చదువుకొని రుద్రమ్మ యది రుయమ్మ కొసంగెను.

రుయ్యమ్మ కన్నీటిజాలులలోనుండి యది చదువుకొని నిర్ఘాంతపోయి పత్రికను కన్నుల కద్దుకొనెను.

రుయ్యమ్మ: "అమ్మా!—"

రుద్రమ్మ: "ఏమే, తల్లీ?"

రుయ్యమ్మ: "న న్నిట్లు పరీక్షచేసెన వేమమ్మా?"

రుద్రమ్మ: "పరీక్ష యేమిటమ్మా?—నీకు అన్నమంత్రీశ్వరులు బంధవిముక్తులై పూర్వపదవిలో నుండుటసమ్మతముగాదటమ్మా?"

రుయ్యమ్మ: "మరి నీకో?"

రుద్రమ్మ: "నాకును సమ్మతమే! లేకున్న నీపత్రిక నీ కేల యిత్తును?"

రుయ్యమ్మ: "ఐతే ఈ భారము నాపై నేల పెట్టవలె?"

రుద్రమ్మ: "నీబాధ చూడలేక అది తీర్చుటకు ఈ యనుమతి యిచ్చినాను."

రుయ్యమ్మ: "ఈ యనుమతితో నా బాధ తీరునా?—నీకు బంధించుట యవసరమని తోచి బంధించినవారిని నేను విడిపెంచుదాననా, అమ్మా!"

రుద్రమ్మ: "నాకుమాత్ర మా మహానుభావుని బంధించుట సమ్మతమటమ్మా? నా పదవిచే నాచేతులు కట్టుబడినవి. అందుచే నీ కీయధికార మిచ్చితిని. ఇది శివాజ్ఞయని నిశ్చయించియే చేసితిని."

రుయ్యమ్మ: "అమ్మా, నీ అనుగ్రహమునకు నేను ధన్యురాలనయితిని. అది శివేచ్ఛయు నగుగాక! అయినను అన్నమంత్రీశ్వరులపై గల సర్వసంశయములు తీరిపోవువరకు, నేనుకూడ నీపత్రము నుపయోగింప నిచ్చగింపను. నాపై నీ కున్న యనురాగముచే నిది యిచ్చినను, మన ప్రేమానుబంధములు రాజకార్యముల కడ్డురానిచ్చుటకు నేను సమ్మతింపను.

రుద్రమ్మ రుయ్యమును గాఢాలింగనమే చేసికొన్నది.

"నీవంటి తల్లిని ఎవరైనా కనియుండిరమ్మా? నిన్ను కూతురనుచున్నందుకే నేను ధన్యురాలనే!"

రుయ్యమ్మ: "ఎంతమాటమ్మా? అన్నమంత్రీశ్వరులపై సందేహము కలిగించిన పత్రములు న న్నొకమారు పరిశీలింపనిత్తువా తల్లీ?"

రుద్రమ్మ: "అవశ్యముగా! ఇప్పుడే పంపు నేర్పాటు గావించెదను."

కొంతవడి వారు మౌనము వహించి యొకరినొకరు ప్రేమాతిశయముతో చూచుకొనుచుండిరి. రుద్రమ్మ యుందు మాట్లాడినది.

"అమ్మాయీ, అన్నమంత్రీశ్వరుల గృహమునకు బోయి వారి కుటుంబమును ఓదార్చి రావలె నని యున్నది. నీవు కూడ వత్తువా?—వారి పిల్ల బాల పుట్టినరోజుపండుగయుట రేపు!"

రుయ్యమ్మ: "అవశ్యముగా!"

---

# అల్లుడు

(27-వ పేజీ తరువాయి)

టట్లుగా వుంది. అయినాగూడా, భయపడుతూనే, వకీలుగారు కోర్టుకు వెళ్ళినారు. జబ్బుకంటే ఎక్కువేముంది?

ఇంతలో కోర్టుదగ్గర బ్యాండు వాయిద్యములు వినబడినై. పగలు అయినా గూడా, బాణసంచాలు "పట, పటా," "ఢమ, ఢమా" అని మ్రోగుతున్నాయి.

వకీలుగారు బయటి కొచ్చారు. ముందర ఆయిన కేమి తెలియలేదు. వెనుక చూచేటప్పటికి అల్లుడుగారు బాగా ముస్తాబై వస్తున్నారు.

మామను చూడగానే అల్లుడు పరుగెత్తుకొనివెళ్ళాడు. మేళములన్నీ అపుచేయబడినై.

"మామగారూ' ఈవేళ ఎంత శుభదినమండీ! నేను ఆనందం పట్టలేకుండా ఉన్నానండీ. ఈవేళ ఇంతకు ఒక్క గంటముందుగా ఈపని జరిగిందండీ. అందుకుగాను ఇవన్నీ తయారుచేసినాను." "ఏముయింది? అని అన్నాడు మామ భయపడుతూ. "ఈదినం మీ అమ్మ చనిపోయిందండీ. అందుకని........." ఇంకా ఏమో చెప్పబోయాడు.

మామ వెంటనే ఇంటికి పరుగెత్తి 'లబోదిబో' ఏడ్చాడు. ఇంక వీడిని ఇక్కడ ఉంచితే మన మర్యాద పోతుందని, కూతుర్ని అల్లుడ్ని, వాళ్ళవూరికి పంపించాము.

కథ కంచికే, మనం యింటికే ...

—

# అదృష్టం

శ్రీమతి మల్లెల కమలాదేవి

ఒక వూరిలో ఒక మూర్ఖుడు కలడు. వాని పేరు వీరన్న. వాడికి ఒకరోజున ఒకరంపము దొరికింది. రంపముతో ఏదైనా కొయ్యాలని తలచి అక్కడే వున్న చెట్టుపై కెక్కేను. వీరన్న ఏకొమ్మ ఐతే కోస్తున్నాడో దానిమీదే కూర్చొన్నాడు. ఇంతలో ఆదారిన ఒకడు పోతూ వీరన్నను చూచి "ఏయ్ అబ్బాయ్! నువ్వు కోసే కొమ్మమీదే కూర్చున్నావేంటి? కొమ్మ ఎప్పుడైతే తెగుతుందో అప్పుడు నీవు కొమ్మతో పాటుపడతావు. కనుక దిగిరావలసిందని చెప్పెను. కాని వీరన్న వింటేగా!



"పోపో" ముందు జరగబోయేది చెప్పేస్తున్నావే నీకు తెలుసా! నేనుఎందుకు పడతాను పడ"ననెను. ఆమనిషి వీడెవడో మూర్ఖుడులాగా ఉన్నాడు. చెపితే వింటం లేదు. పోనీలే, ఎవరి ఖర్మ వారిదనుకొని తనదారిన తను వెళ్ళసాగెను. వీరన్న కోసేకొమ్మ పూర్తిగా తెగేసరికి కొమ్మ క్రిందపడెను. కొమ్మతో పాటు వీరన్న కూడా పడెను. "అరే ఇందాక ఆమనిషి నేను పడతానని చెప్పాడే. ఆయన బహుశా దేవుడు కావచ్చు. దేవుడు కాకపోతే మరి నేను పడతానని ఆయన కెట్లా తెలిసింది. ఆయన తప్పకుండా దేవుడే. నేను ఎప్పుడు చచ్చిపోతానో ఆయనను అడగాలి." అని వీరన్న పరిగెత్తికెళ్ళి ఆమనిషిని పట్టుకొని "దేవుడా, నేను ఎప్పుడు చచ్చిపోతానో చెప్పు" చెప్పకపోయావా నిన్ని ఇక్కడనుంచి కదలనివ్వననెను. ఆమనిషి ఇట్లని ఆలోచించెను. "వీడు మూర్ఖుడు. నేను దేవుడను కాను అని చెప్పినా నన్ను వదలడు. వీడినుంచి తప్పించుకొని పోవాలి." ఆమనిషి ఒక నల్లటిదారమును తీసి వీరన్న చేతికి కట్టి "ఈ దారము తెగిపోయినప్పుడు నీవు చచ్చిపోతావని" చెప్పి అతను వెళ్ళిపోయెను. మెల్లిగా వీరన్న కూడా యింటికి చేరాడు. యింటికి వెళ్ళీవెళ్ళటంతోనే భార్య ఎదురుగా వచ్చి "మీచేతికి దారము ఉందేమిటండీ" అని అడిగెను. వీరన్న ఇట్లని జవాబిచ్చెను. ఆ దారము తెగితే నేను చచ్చిపోతాను. "దారము తెగకుండా జాగ్రత్తగా కాపాడాలి" వానిమాటలకు భార్య నవ్వి దగ్గరకు వెళ్ళి దారము త్రెంపివేసెను. దారము తెగగానే వీరన్న "నేను ఇక బ్రతకను. నేను చచ్చిపోతాను" అని ఒక పలుగు తీసుకొని శ్మశానములో కెళ్ళి గొయ్యితీసుకొని దానిలో కూర్చొనెను. అర్ధరాత్రి అయ్యెను. దొంగలు ఒక రాజుగారింట్లో పడి సర్వమూ ఎత్తుకొచ్చి వీరన్నగొయ్యికి కొద్దిదూరములో కూర్చుని వాటాలుపంచుకొనుచుండిరి.

వీరన్నకు ఆకలి వెయ్యసాగెను "నేను చచ్చిపోయినా నా అకలి చావలే" దని వీరన్న పెద్దగా కేకవేశెను. వాని కేక విని దొంగలు భూతమో, దయ్యమో అనుకొనిభయపడి కాళ్ళచెప్పులు కూడా వదలిపెట్టి వెనక్కు తిరిగిచూడకుండా పరిగెత్తిపోయిరి. గోతిలో కూర్చున్న వీరన్నకు ఆకలి ఎక్కువయింది. ఇక లాభం లేదు. "ఇంటికివెళ్ళి రొట్టెలు తిని మరల వచ్చి చచ్చిపోతాను" అని వీరన్న పైకివచ్చేసరికి నగలు, ధనమూ, కనపడినవి. నగలు ధనము మోయతేనంతమూటలు కట్టుకొని ఇంటికివెళ్ళి భార్యకు సంగతంతా చెప్పి,

# ధూమాసుర సంహారం

( 24వ-పేజీ తరువాయి)

చిలిపితనంగా ఉంది. రోతగా వుంది. అబ్బె వేళ్లు పొగమారుతున్నాయి. చొక్కాలూ పంచలూ కాలుస్తున్నాయి. కాతేకాతే సిగరెట్టు ఎప్పు డెక్కడ పెడుతున్నానో తెలియదు పరధ్యానంలో. ఇదేమున్నాపోనీ నా ఒంటికి మంచిదా ? అదీకాదు. దీనివల్ల గొంతులో బెరడు కడుతోంది. పొడిదగ్గు వస్తోంది. ఎంతమంది కాల్చ లేదు ? మళ్లీ మానలేదు ? రైలింజన్‌లాగా పొగలు కక్కే వాళ్లు కూడా చల్లారిపోయి ఊరుకున్నారు. వాళ్లు చెప్తోనేవున్నారు. పొగతాగడం మానేసిన తరవాత వాళ్లెంత బాగుపడిందీ. నీరసం వొణుకు నిస్సత్తువ వొదిలిపోయాయట. రాత్రివేళ ఇప్పుడు చక్కగా నిద్ర పడుతోందట. కళ్లు తేటపడ్డాయట. పీల్చి వొదిలితే గాలికంపు పోయిందట. ఇంట్లో వాళ్ళంతా సుఖపడ్డారు)"

అయితే ఇదంతా బాగానేవుందికాని అలవాటయిపోయినదాన్ని ఎలా వొదిలెయ్యడం అని మీరడగవచ్చు. "పొగాకు ఘుమఘుమ లేకపోతే ప్రాణం విలవిల్లాడిపోతుందే. అదే కొత్త నరాల్ని మీటుతున్నది. అది లేకపోతే నరాలు బిగిసిపోవూ ?" అనచ్చు మీరు. ఇదంతా వొట్టిది. భ్రమ. ఇందులో ఒక్కటీ నమ్మొద్దు. ముందే ఇదొల్లాగరా బాబూ అని హరాం చేసే తేభ్యాల కుతర్కాలకి చెవి ఒగ్గకూడదు. నికొటిన్ (పొగాకులోని విషపారం) లేకపోతే ఈ శరీరం నడవదని అపోహపడవద్దు. ధూమపానం నల్లమందు మాదిరి కాదు. మద్యసేవమాదిరి తీరని దాహమూ కాదు. నిజానికి ఏమందుకీ ఈ ఒళ్లు బానిస కాదు. బానిసయింది మనసు. మనిషి అలవాట్లకి బానిస. అంతేకాని శరీరం దేనికి బానిస కాదు. సైకిలు తొక్కుతున్నట్టే అభ్యాసమైనతరవాత అనుకోకుండానే మరలాగాచేసే పనుల్లో ధూమపానం ఒకటి. సైకిలు గంటిపైకెక్కి కూచోగానే అటూ ఇటూ పడిపోకుండా చేతులు వాటంతటవే మనం చెప్పనక్కర్లేకుండా బాలన్సు నిలుపుతాయి. కాళ్ళు తొక్కుతూఉంటాయి. గ్రహించినా గ్రహించకపోయినా కళ్లు గోడలూ స్తంభాలూ తగలకుండా చూసుకుంటూ నడుపుతాయి. ధూమపానంకూడా అలాగే. మనకి తెలియకుండానే చెయ్యి జేబులోకి పోయి సిగరెట్ పెట్టినీ, అగ్గిపెట్టెనీ పైకి తీస్తుంది. ఆ తరవాత మనకి తెలియకుండానే ఒకచెయ్యి ఒక సిగరెట్టుతీసి పెదవుల కందిస్తుంది. వాడిచెయ్యి అగ్గిపుల్ల వెలిగించి అంటిస్తుంది. మనకి తెలియకుండానే నోరు మూసుకుపోయి పొగ లాగుతుంది. ఇదంతా చాలవరకూ మనం ఆలోచించ నవసరం లేకుండానే జరుగుతున్నందువల్ల అప్పుడప్పుడు పొరపాట్లు జరుగుతుంటాయి. ఒక్కొక్కప్పుడు అగ్గిపుల్ల పెదవులికి తగిలించి సిగరెట్టుతో అగ్గిపెట్టిమీద నిప్పు వెలిగించబోతాం.

కాబట్టి ఈ అలవాటు తప్పించడం అంటే, మొదట చెయ్యి జేబులోకి పోకుండా చెయ్యాలన్నమాట. ముందుగా ఇంట్లోఉన్న సిగరెట్లు, పెట్లు ఉత్తవీ గట్టివీ అన్నిటినీ వీధిలోకి (డబ్బాలో) పారెయ్యాలి. లేకపోతే ఖాళీపెట్టెలూ, తగరాలూ ఎక్కడైనా కనిపిస్తే పరధ్యానంలో ఉన్నప్పు డెప్పుడో మన మనస్సుని దగా చేసి ఊరుకుంటాయి.

ఇంకో అనుపానం ఉంది. ధూమపానం అలవాటుకాబట్టి, దీన్ని మానడంకూడా ఒక అలవాటేనని జ్ఞాపకం ఉంచుకోవాలి. ఆ అలవాటుకోసం కొందరు పిప్పరమెంట్లు చప్పరిస్తారు. కొందరు నశ్యం పీలుస్తారు. కాని నశ్యం పీల్చినందువల్ల లాభంలేదు. పట్టుకుంటే సిగరెట్లదెయ్యమైనా వొదల్చవచ్చుగాని నశ్యందయ్యాన్ని అసలేమీ చెయ్యలేం. మళ్లీ అది పుడకల్తో పోవలసిందే. మరింత రోత కలిగించే అలవాటుకి ఈమారు ఆజన్మాంతం దాస్యం చెయ్యవలసొస్తుంది. కాబట్టి ఏపిప్పరమెంట్లు చప్పరించడమో మంచిది. ధూమాసురుడి ప్రభావం అంతరించినతరవాత పిప్పరమెంట్ల అలవాటు దానంతటదే తప్పుకుంటుంది.

అడపాతడపా వక్కఆకూ తగిలించవచ్చు. మరీ నిలవలేనివాళ్లు ఆట్టే సిగ్గుపడక గట్టివి జీడికణికలు తెచ్చి ముక్కలుచేసి బుగ్గనేసుకూర్చుంటే చాలు. దంతాలు నొప్పిపుట్టేవరకూ సాధన చెయ్యవచ్చు. మళ్లీ మెత్తటిసరుకు తెచ్చుకుంటే ప్రమాదం. రోజూ వీశలకొద్దీ ఖర్చయిపోతుంది. అందువల్ల దంతాలతో యుద్ధం చెయ్యగల కణికలు వాడ్డం మంచిది.

మొదటిరోజుల్లో అనుక్షణం సిగరెట్ దేవి కళ్లకి కట్టినట్టుండి చాలా ఖేదం కలుగుతుంది. ఏదో తెలియని తీరని ఆవేదన ఏమూలో పిండుతూఉంటుంది. ఇది సహజమే. ఒకొక్కప్పుడు అల్లా గుడివేపుగా పొరుగు వేపుకో వెళ్ళాలనిపించినట్లుు, మనకి తెలియకుండానే పక్కనేవున్న సిగరెట్‌దుకాణానికి కాళ్లు దారితీస్తాయి. మనస్సు ఆం ! ఆం ! అని అటకాయిస్తున్నా వినిపించుకుంటూనే, అల్లాగే అల్లాగే అనుకుంటూనే, నడిచినడిచి తీరా కళ్లెత్తి చూసేసరికి సిగరెట్‌దుకాణం సాక్షాత్కరిస్తుంది. ఈ మాయాజాలంనుంచి ప్రాణాలొడ్డి బయటపడాలిసిందే. పైనచెప్పిన అనపానాలవంటివి ఉంటే కొంత సహాయపడి మనకి అనుకూలిస్తాయి. చివరికి అదేవస్తువు అంతసేపు నమలడానికి విసుగుపుడుతుంది. కాని సిగరెట్ మనస్సులో ఛాయామాత్రంగానైనా నాసరే పొడగట్టినవెంటనే పిప్పరమెంటో పైనచెప్పిన కణికముక్కో గభాల్ని నోట్లోవేసుకోడం అలవాటైతే చాలు. ఈ బాధపళ్లేక ఇంక మరి సిగరెట్ మనస్సులో నీడలా కనిపించడంకూడా మానేస్తుంది.

ధూమపానంవల్ల పడే అగచాట్లు ఇన్నీ అన్నీ కావు. మన బుద్ధికి ఒక పొగతెర కమ్మేస్తుంది. ఆ తెరలోంచి చూస్తే అన్నీ విచిత్రంగా కనిపిస్తాయి భోజనానంతరం దమ్ము లేకపోతే అన్నంరుచి తెలిసిరాదని కొందరనుకుంటారు. అసలు జీర్ణమే కాదని కొందరనుకుంటారు. సారం ఒంటికెక్కదట. మృష్టాన్నతృప్తి ధూమపానంతో కాని పూర్తికాదుట. కొందరు సిగరెట్ దమ్ముల్తో పాటుగాని కాఫీ పీల్చలేరు. కొందరికి సిగరెట్ తగిలిస్తేగాని పేగులు ఖాళీకానే కావుట. అసలు కదలికే ఉండదుట. అసలు సగరెట్ లేకుండా చెంబు చేదికెళ్లా వస్తుంది అనేది ప్రకృతి చిత్రవిశేషాలే అంటారు. కొందరికి పక్కనుంచి లేవగానే

---

"భోజనం పెట్టు. అన్నం తిని నేను మళ్ళీ చచ్చిపోతా" ననెను. భార్య వానితో ఇట్లనెను. మీరు చచ్చిపోరు. మీరు ఇంకా వెయ్యేళ్లు బ్రతుకుతారు. మూర్ఖుడైన వీరన్న నేను ఇంకా బ్రతుకుతా నని సంతోషించెను.

సిగరెట్ దానంతటది వచ్చి నోట్లో పొగలు కక్కుతూ ఉండాలంటారు రాత్రి ఏడు దాటిందంటే సిగరెట్ లేకపోతే నిద్రవొచ్చి మెడలు వొంచేస్తుందంటారు కొందరు అల్లా అల్లా పీలుస్తూఉంటేగాని నిద్రపట్టదంటారు కాని ఇదంతా ఒట్టి అబద్ధం. భ్రమ, మాయ సిగరెట్ వ్యాపారులే ఇటువంటి అసత్య ప్రచారం చేసివుంటారు. అదిలోకాన్ని పట్టి పీడిస్తోంది.

చిత్తచాంచల్యానికి అనేక ఆకర్షణలుంటాయి. మర్యాదకోసం తాను కాలుస్తూ మిత్రుడు మనకి కూడా ఇవ్వచూపే సిగరెట్ ఆకర్షణ అంత బలీయం కాదు. ఇది ఇష్టే దులిపేసుకోవచ్చును కాని ధూమపానంవల్ల ఏదో అతీతమైన ఆనందం సౌఖ్యం, తృప్తి కలిగిస్తాయనే భ్రమకంటె మించిన శత్రువు లేదు మనల్ని ఏవో లోకాలికి తీసుకుపోతాయనుకోడం పొరపాటు (ఏ లోకానికి పోయినా నోటికిపట్టే తుప్పుకంపు వొదల్నే వొదలదు. ఈ లోకానికి పడ లాగుతూఉంటాయి) కళ్లెదుట లేత నీలమేఘాలు సృష్టించుకుంటూ ఏవో ఎండమావుల్లో పడిపోతాం కాని ఇదంతా మానవుల్ని అధోగతికి లాక్కుపోతున్న మాయావాగురం. ఈ మాయనుంచి ముక్తిపొందాలంటే ఒక్కసారి వెనుదిరిగి చూడండి సిగరెట్ ఆరంభించినది నాలోపెట్టిన వికారం, తుప్పుకంపు, మసివాసన, కళ్ళకు చేసిన వేడి, ముక్కులో వచ్చిన సెగ అన్నీ జ్ఞప్తికితెచ్చుకోండి ఇదేదో మహాద్భాగ్యమని భ్రమించి ఈ బాధలన్నిటితోనూ పెనుగులాడిన రోజులు ఒకసారి స్మరించండి అందులో అమృతం ఉన్నట్లుగా మిత్రులు కృత్రిమమానందాన్ని అభినయించడం, అలా అనకపోతే ఎదో అసమర్థత బైటపడిపోతుందనే బెంగతో తుప్పుకంపు నోటిలో మూసుకుని బిగబట్టి భరించి వెకిలినవ్వులు నవ్వడం, నోట్లో వికారమొచ్చి కడుపులో దేవినప్పటికీ మిత్రులు అవహేళనచేస్తారనే బెదురుతో ఒకదానిమీదొకటి కాల్చడం అన్నీ జ్ఞప్తికి తెచ్చుకోండి ఒక్కొక్కప్పుడు కళ్లు చిరతలు కమ్మిఉంటాయి కూడా అవన్నీ మీరు మరిచిపోకుండా ఉన్నట్లయితే ఈ భ్రమంతా పటాపంచలైపోతుంది ఎక్కువమైనా కుక్కినట్లు రోజుకి రెండుపెట్లు మూడుపెట్లు కాలుస్తున్నట్లు చెప్పుకోవాలనే ఆత్రంతో శారీరకధర్మంతో పోరాడినరోజులు జ్ఞాపకం చేసుకుంటే చాలు ఈ కృత్రిమానందం తన్మయత వొదిలిపోతాయి. ధూమపానం అధికంగా చేసేవారి ఆయుఃప్రమాణం క్షీణించిపోతుందని శాస్త్రజ్ఞులు రుజువుచేశారనేమాట మరిచిపోవద్దు.

కనీసం మీ బిడ్డల ముఖమైనాచూసి ఈ భ్రమల్ని తొలగించుకోనండి ఏ మొహంతో (ఏ పెదవులతో) పసిపాపని ముద్దుపెట్టుకుంటారు? స్మృతికి రెండుముఖాలున్నాయి ఒకటి సహజమైనది రెండోది భ్రమ. ఒకటి ప్రకృతి ఒకటి కృత్రిమం ఒకటి పరాత్పరుని సృష్టి రెండోది విశ్వామిత్రసృష్టి ఒకటి చిరునవ్వుతో పలకరిస్తుంది ఒకటి (వికారంచేత కాబోలు) డోక్కొబోతున్నట్లున్న ముఖంతో పీడుస్తూ పరామర్శిస్తుంది

ఈమధ్య ఒకరోజున అసలు సిగరెట్ మాటే తలపును రాకపోయేసరికి నాకే చాలా ఆశ్చర్యం వేసింది అపరిమితమైన ఆనందం కలిగింది తరవాత మిత్రులు కలుస్తున్నప్పుడు చూడ్డంతప్ప శ్వేతకాష్ఠరూపం నా అంతరంగంనుంచి పూర్తిగా చెరిగిపోయింది తరవాత అనేకమంది సిగరెట్లు కాల్చేవాళ్ల మధ్య సంచరిస్తూ వచ్చాను. అనేకమంది సిగరెట్లు అందివ్వబోయారు కాని పూర్తిగా నాలో విముఖత కలిగింది క్రమక్రమంగా ఆకలివెయ్యడం, భోజనంతో ఆకలి తీర్చుకోడంలోగల తృప్తి అప్పుడుగాని అర్థమైనాయికావు తిన్నవస్తువుల అసలు రుచి తీపి, కమ్మనితనం అప్పుడుగాని పూర్తిగా తెలిశాయిగావు అన్నం ఇప్పుడు చక్కగా సహిస్తోంది మాటిమాటికి చేతులాణకడం గుండెలు కొట్టుకోడం మానేసింది శారీరకసుఖంఅంటే ఇప్పుడుగాని బోధపడలేదు ప్రశాంతమైన వాతావరణంలో మనశ్శాంతిని అనుభవించగలుగుతున్నాను. రాత్రి నిద్రపట్టక పడకపైన దొర్లుతూ పడేయాతన అంతర్ధానమైపోయింది నా దినకృత్యంలో ఉత్సాహం, నా కర్తవ్య నిర్వహణలో ఆత్మవిశ్వాసం తిరిగి తేరుకున్నాయి ఈనాడు ధూమావృతంకాని జీవితంలోని మేలు తెలిసివస్తోంది

అన్నిటికంటె మించి పరమశత్రువుని జయించడంలో గల ఉత్కృష్టానందం అనుభవించగలుగుతున్నాను మహిషాసురుని మర్దించినప్పుడు లోకమాత అతీతానందంతో నృత్యం చేసినట్లు ధూమాసురసంహారానంతరం నాలో ఉత్సాహం పొంగిపొరలింది

[యువర్ లైఫ్ పత్రికనుంచి]



అమెరికా ఇటలీకి "ఎక్సిలోనా" నౌకలో యుద్ధసామగ్రులు పంపింది.

# మధుర దేవాలయము

శ్రీమతి వారణాశి యశోదాదేవి



భారతవర్షములో ప్రాచీనకాలమునుంచి అతిముఖ్యమైన పుణ్యక్షేత్రాలలో నొకటి మధుర. ఇది పాండ్యసామ్రాట్టుల, విజయనగరసామంతులైన నాయకరాజుల రాజధానిగ ప్రసిద్ధిగన్నది. మధురాధినాథుల శత్రువులకు మధురాంతక మధురైగొండ బిరుదులు గర్వప్రదములు. వైగైనదీతీరమున మధురలో మీనాక్షీసుందరేశ్వరులు వెలసిరి. కంచికామాక్షి, మధురమీనాక్షి దక్షిణభారతమందలి హైందవులకు ప్రియదైవతములు. మీనాక్షీసుందరేశ్వరుల కీర్తించు కీర్తనలు, పదములు, పద్యములు తమిళమందే కాక, ఆంధ్ర, సంస్కృతములందును మిక్కుటముగ గలవు.

మన దేశంలో స్థలమాహాత్మ్యము, పురాణగాథ లేని క్షేత్రము లేదు. తమిళములో తిరువిళయాడాల్ పురాణము మధుర పూర్వము కదంబవనముగా నుండి పట్నముగా మారినవిధము వర్ణించును. పాండ్యరాజు మణవూరు రాజధానిగ పాలించుచుండగా వర్తకమునకై పడమటి దేశముల కేగిన సంపన్నవ్యాపారి తిరిగివచ్చుచు చీకట్లు క్రమ్మినందున కదంబవనములో నాగెనట; పుష్కరిణిలో స్నానమాచరించి సంధ్యవార్చి, తీరమున చక్కని శివలింగమును గాంచి చకితుడయ్యాడు. మరునాడు మణవూరులో పాండ్యరాజుకు సంగతి విన్నవించగా, ఆ రాజు వెంటనే మంత్రిపరివార సమేతముగ బయలుదేరివచ్చి, వనము కొట్టించి, ఆలయము పుష్కరిణిమధ్యగా వచ్చువిధమున పట్నము నిర్మించాడు. వేదపఠనకై పద్మమంటపము, ఉత్సవములకై అర్ధమంటపము, నాట్యమండపము, పాకశాల చుట్టు చిన్న గుళ్లు కట్టించాడు. ఎత్తైన గోపురములు, రథవీధులు, క్రొత్త కొ[illegible]లు నిర్మించాడు. ప్రజల యారోగ్యభాగ్యముల కన్నివిధముల తగియున్నందున మధుర యని పేరుపెట్టారు. తర్వాత వరదలువచ్చి ఆలయం తప్ప పట్నమంతయు పాడు కాగా తిరిగి పూర్వమువలె పురమును పునరుద్ధరించిరట. మధురను సుందరమైన పట్నము అనగా తిరివండంగల్ అనుచుండిరి. చోళరాజు కాడువెట్టి సుందరేశ్వరుని దర్శనార్థము రాగా వైగై పొంగి, మధుర ఆలయపు ఉత్తరద్వారము మూసికొని, రాజు తాను వచ్చిన పని విన్నవించినతర్వాత తెరుచుకొనెనట.

చారిత్రకముగ ఆలయనిర్మాణ మెప్పుడు జరిగెనో సరిగ తెలియదు. సుందరేశ్వరుడు సుందరపాండ్యుని సమాధిపై వెలసెనందురు. కాని పాండ్యరాజులలో సుందరనామము సుందరేశ్వరుని పేరైయుండవచ్చును. దాక్షిణాత్యదేవాలయములకు ముఖ్యమైన చాలికలన్నియు మధురయాలయమున గలవు. కాని యీ ఆలయం విదేశయాత్రికుల దృష్టి నెక్కుడుగ నాకర్షింపకుండుటకు కారణమేమో! ఆలయగర్భగృహము నాయకరాజులలో మొదటివాడు విశ్వనాథుడు కట్టించెనట. ఇతరముఖ్యభాగములు తిరుమలనాయకుడు (క్రీ. శ. 1622-1657) నిర్మించాడు. అన్నిటికంటె పురాతనమంటపము నాయకరాజులు కట్టించినదే. కల్యాణమంటపము 7071 నందును, తత్తసద్ధి 1770 సం|| లోను కట్టబడెనట.

ఆలయము దాదాపు చతురస్రముగనున్నది. కొలతలు నాల్గువైపులు 720, 729, 834, 852 అడుగులు దీనికి ఐదు అత్యున్నత గోపురములు, ఐదు చిన్న గోపురములు గలవు. అన్నిటికన్న పెద్దగోపురము ఎత్తు 52 అడుగులు. గోడలతో చుట్టబడిన చక్కని సరస్సు. సహస్రస్తంభమంటపము గలవు. మీనాక్షీఆలయము 15 స్తంభముల యావరణతో నున్నందున మిగత స్తంభములు 985. ఆలయమున కెదురుగ తిరుమలనాయకుడు కట్టించిన పెద్దమంటపము గలదు. దీని పొడవు 333 అడుగులు వెడల్పు 105 అడుగులు ఇందులో నాల్గువరుసల స్తంభములు వేర్వేరు విధములుగ నున్నవి. మంటపముమధ్య స్తంభములమీద మనుష్యప్రమాణము గల ప్రతిమలు గలవు. ఈ మండపనిర్మాణము 22 సం|| లు (1623-1645) పట్టెను. ఇందులో ఈశ్వరుడు సంవత్సరమునకు పదిరోజులు గుడినుండి వచ్చి తగువిధమున రాజు, ప్రజలచే సత్కరింపబడును. అందుకొరకే ఈ మంటపము నిర్మింపబడెనట.

ఈ మంటపమున కెదురుగ తిరుమలనాయకుడు ప్రారంభించిన గోపురము గలదు. తిరుమలనాయకుడు మృతినొందుటచే, యిది యసంపూర్తిగ వదలివేయబడినది దీని కొలతలు ఉత్తరమునుండి దక్షిణమునకు 174 అడుగులు; లోతు 107. దాని ద్వారము వెడల్పు 21 అడుగులు 9 అంగుళములు. ఇది శ్రీరంగముఆలయములో ద్వారముకంటె పెద్దది. బహుచక్కగనున్నది. ద్వారబంధములు 57 లేక 60 అడుగుల ఎత్తుగల ఏకశిలానిర్మితములు; శిల్పకళాన్వితములై యున్నవి. ఈ గోపురము పరిపూర్ణమైతే అసమాన సౌందర్యాన్వితముగ నుండియుండును.

మధురయాలయములో దక్షిణభాగమున మీనాక్షి, ఉత్తరభాగమున సుందరేశ్వరుడు

(38 వ పేజీ చూడుడు)

# కులాసా కబుర్లు

## 'విహితులు - విరోధులు'

[శ్రీ జి. యస్. సూరి]

శుక్రాచార్యులవంటి బుద్ధిమంతుడు ఒకడు గొప్ప నీతి నొకదానిని లోకానికి అందచేశాడు. స్నేహితుడితో వ్యవహరించేటప్పుడు ఆ స్నేహితుడు ఎప్పుడైనా విరోధిగా మారిపోవచ్చు ననే అవకాశాన్ని మరచిపోగూడ దన్నాడు. అదేవిధంగా విరోధిమీద కచ్చ సాధిస్తున్నప్పుడు ఆ విరోధి ఒకనాడు స్నేహితుడుగా మారిపోయేపరిస్థితిని జ్ఞప్తిలో ఉంచుకోమన్నాడు. ఇవి నిజంగా దివ్య సూత్రాలు.

సూత్రంలోని మొదటి క్లాజును నిర్లక్ష్యం చేశా మనుకోండి. అప్పుడు ఏమి జరుగుతుంది? మనవాడేకదా అని గుట్టు అనేది లేకుండా, చెప్పతగినవీ చెప్పకూడనివీ యావత్తూ బయటపెట్టి వేస్తాము.

సంగతిసందర్భాలన్నీ జాయలాపాయలాగా విని అనుకోకుండా చిట్టాలోకి ఎక్కించివేస్తాడు. మన స్నేహితుడు. కాలం గడచిపోతుంది. ఇంతలో పేకాటలో లెక్కపుయుక్క ఆడినందుకో లేక పిచ్చ సినిమా చిత్రాన్ని చూచి లొట్టలువేసినందుకో, సరసం విరసంగా మారటం సంభవిస్తుంది. దానితో ఉభయపార్టీలకు తెగతెంపులు కలిగి ప్రచ్ఛన్నయుద్ధం ఆరంభ మవుతుంది. అమాయకంగా అందచేసిన రహస్యాలన్నీ మారణాస్త్రాలుగా మనమీదే ప్రయోగం అయి కీలకస్థానాలు దెబ్బతింటవి.

ఇక రెండవక్లాజునుగురించి ఆలోచింతాము. విరోధిని కుంగతీయటానికి అందుబాటులో ఉన్న అన్ని సాధనాలనూ వినియోగిస్తాము. వాక్చాతుర్యమంతా ప్రదర్శించి వెనకా ముందూ చూడకుండా తూర్పార పడతాము. గుడ్డేటుగా బాణ మేదైనా గమ్యస్థానాన్ని ఛేదిస్తే రబ్బరుబెలూన్‌మాదిరి పొంగిపోయి బోర్లపడతాము. ఇట్లా ఉండగా కారణాంతరాలవల్ల అనుకోకుండా విరోధితో నెయ్యంపొసగటం సంభవిస్తుంది. అప్పుడు మన పూర్వపు ప్రవర్తన మనకే అడ్డువచ్చి కుడితిలో పడిన ఎలుకవలె ఉద్దుకుడుచుకోవలసివస్తుంది.

ఇండియాపాకిస్తానల ప్రస్తుతసంబంధాలు పైన ఉదహరించిన సూత్రంలో రెండవ క్లాజుక్రిందికి రాగలవు పాకిస్తాన్ అవతరించినక్షణంనుంచి కొద్దిరోజులక్రిందటివరకూ ఉభయరాజ్యాల మధ్య పచ్చిగడ్డి వేస్తే భగ్గుమన్నది. గాంధీగారి ట్రెయినింగ్‌వల్లనైతే నేమి, సాంప్రదాయంవల్లనైతేనేమి లేక చేతగానితనంవల్లనైతేనేమి ఇండియావారు పెద్దఅన్నయ్యమాదిరి కొంత మాతృభావం చూపినా, పాకిస్తాన్‌మాత్రము పంపిణీదావా వేసి భాగం పంచుకున్న చిన్నతమ్ముడిమాదిరి కయ్యం సాగిస్తూనేవచ్చారు. అక్కడి నాయకులు అవకాశం దొరికినప్పుడల్లా విసిరాళ్లు పెడుతూనేఉండేవాళ్లు. ఉపన్యాస వేదికలలో బయలుదేరిన ఉద్ధృతాన్ని పత్రికలూ, రేడియోలూ బాకా లూదినవి. రాను రాను పరిస్థితులు విషమించి తీవ్రరూపం దాల్చేవరకూ వచ్చినవి.

ఇంతలో కథయావత్తూ తారుమారు అయింది. నెహ్రూగారు కరాచీకి ఆహ్వానం పంపారు. లియాఖత్ ఆలీగారు ఆహ్వానాన్ని అంగీకరించి ఢిల్లీకి వేంచేశారు. తెరచాటున కలుసుకొని, వారంరోజులు సంప్రతించి ఉభయులూ భాయీ అంటే భాయీ అనుకున్నారు. పూర్వం జరిగినదానికంతకూ ఘూనాబొడ్డం బాలు అన్నారు. సహపంక్తిన విందులు చేశారు. చిరునవ్వులతో ఫోటోలు తీయించుకున్నారు. విరోధులల్లా స్నేహితులైపోయినారు.

ప్రచ్ఛన్నయుద్ధం రద్దుకాగానే రేడియోలూ, పత్రికలూ బాకా లూదటం మానివేసినవి. నెహ్రూగారు సకుటుంబ సపరివారంగా కరాచీకి ప్రయాణం కట్టారు. సరదాగా మూడునిద్దర్లు చేసి ఢిల్లీకి తిరిగి వచ్చారు. పిలకలకూ గడ్డాలకూ పీటముళ్లు పడినట్లు చెప్పవచ్చు.

నెహ్రూపండితుడికీ లియాఖత్ ఆలీగారికీ ఒకవిధమైన తగాదా లేని పోటీ ఒకటి ఉన్నట్లు ప్రతివాడికీ గోచరించకమానదు. ఈ పోటీకి ఉపకరించే పరిస్థితులు తమాషాగా ఉభయపార్టీలకు అందుబాటులో ఉంటున్నవి. ఢిల్లీ వచ్చినప్పుడు ఆలీగారు పూలదండ సమర్పించటానికి మనకు గాంధీ మహాత్ముని సమాధి ఉంటే, నెహ్రూగారు కరచీ వెళ్లినప్పుడు పుష్పాంజలి ఇవ్వటానికి వాళ్లకు జిన్నాగారి సమాధి ఉంటున్నది. ఈ సమాధులు చిత్రంగానే సిద్ధించినవి. భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాదించిన వాడు మహాత్ముడు. పాకిస్తానును నిర్మించిన వాడు క్వయిద్ అజాం. ఉభయులూ తమ జీవితఆశయం సిద్ధించగానే నిష్క్రమించారు. బ్రతికిఉన్నంతవరకూ తమతమ దేశాలను ఉద్ధరించటమే గాక వీరు ఇద్దరూ తనువులు చాలించినతరువాతగూడ ఉపకరిస్తున్నారు. రాజకీయలాంఛనాలకు వారి సమాధులు అద్భుతంగా తోడ్పడుతున్నవి.

నెహ్రూగారు అమెరికా వెళ్లివచ్చాడు' వెంటనే ఆలీగారికి ఆహ్వానం వచ్చింది. ఇప్పుడు వీరు ఆ వింతదేశంలో పర్యటనం చేస్తున్నారు. ఆకారంలో కొంచెం మహాకాయుడు కావటంవల్ల పాకిస్తాను ప్రధాని నెహ్రూగారివలె దుమారం రేగేట్టు తిరుగలేకపోయినా సుడిగాలివలె ప్రయాణం చేస్తున్నాడు. వాషింగ్‌టన్‌లో ట్రూమన్‌గారు, ప్రముఖులను పరామర్శించటానికి ఏర్పాటు చేసిన సరుకుసరంజామాను ఉభయులకూ సమానంగానే ఉపయోగించారు. తిరునాళ్లను చూచినట్లు జనం గుంపులుగా తయారైనారు.

అయితే నెహ్రూగారికి కొన్ని అతిశయాలు సహజంగా ఉన్నందువల్ల అమెరికనులను అధికంగా ఆకర్షించగలిగాడు. ప్రపంచరాజకీయవేత్తలలో నెహ్రూ చాల అందగాడని సౌందర్యశాస్త్రజ్ఞులు నిర్ణయించారు. అదీగాక గాంధీగారి అదృశ్యతేజస్సు చూచేవారికి ఈయనను ఆచ్ఛాదించినట్లు తోస్తుంది. ఆపైన లియాఖత్ ఆలీగారిమాదిరి నెహ్రూగారు రాజకీయరంగం ద్వారా మాత్రమే పైకివచ్చిన వ్యక్తి కాడు. ప్రజా

(40-వ పేజీ చూడుడు)

# రైత్వారీ సంస్కారం

సుమతి

మద్రాస్ ప్రభుత్వంవారు శ్రీ యం. వి. సుబ్రమణ్యంగారిని చైర్మన్ చేసి, మన రాజధానిలోని కమతం పద్ధతులను విచారించి తగు సంస్కరణలు సూచించినను చిన్న కమిటీని నియమించటం సమంజసంగా ఉన్నది.

మద్రాస్‌లో సాగుకు లాయకైన ఉన్న భూమి అమరకం రెండువిధాల ఉన్నది. జమీందారీ ఒకటి, రైత్వారీ ఒకటి. మొత్తం భూమిలో మూడోవంతుది జమీందారీ భూమి. బ్రిటిష్‌వారు దేశాన్ని స్వాధీనం చేసికొన్నపుడు ఏర్పాటుచేసి నిలబెట్టినది ఈ జమీందారీపద్ధతి. అప్పటికి శేషించి ఉన్న చిన్న, పెద్దరాజులను కూడగట్టుకొని, వారి ఆసరాతో సులభంగా శిస్తుదస్తులు వసూలుచేసిపెట్టే ఏజంట్లుగా ఈ జమీందార్లను బ్రిటిష్‌ప్రభుత్వమువారు ఏర్పరచిరి. సాగుచేసే రైతులనుంచి ఎంత వసూలుచేసి జమీందార్లు తమకు అనగా ప్రభుత్వమునకు ఎంత ఇవ్వవలెనో శాశ్వతముగా నిర్ణయించిరి. దీనినే పర్మనెంట్ సెటిల్మెంటు అందురు. జమీందారు ప్రభుత్వమునకు చెల్లించే మొత్తమును పేష్కష్ అనువారు. ఈపద్ధతిప్రకారము ఈ పేష్కష్ మొత్తములుమటుకు తొలుత విధించనట్లే మారకుండెనుగాని రైతులనుంచి జమీందార్లు వసూలుచేయు శిస్తులు చాలరెట్లు పెరిగిపోయి ఏజెంట్లుగా ఏర్పడిన జమీందార్లు స్వతహా భూస్వాములనిపించునంత బలాఢ్యులై, రైతులు చితికి, ఫలసాయం దెబ్బతిన్నది. ఉత్తరసర్కారుల్లోని దక్షిణాన [illegible]ద్దిమేరను ఉన్న జమీందారీ పద్ధతి 1947 లో మద్రాస్ ప్రభుత్వం చేసిన శాసనం వల్ల రద్దుఅయిపోతున్నది. ఈ శాసనం మూలకంగా రైతుకు సర్కారుకు మధ్యాన జమీందార్ల ప్రమేయం లేకుండా పోతున్నది; జమీందారీపద్ధతి బదులు ఇతరత్రా అంతటా ఉన్నట్లే రైత్వారీపద్ధతి వస్తున్నది. ఇంతవరకున్నూ రైతులు జమీందార్లకు చెల్లిస్తున్న హెచ్చుశిస్తులు తగ్గించబడి హంసాయి రైత్వారీరైతులు చెల్లించే శిస్తుల సుమారులోకి దిగుతున్నవి.

కనుక ఇప్పుడు రాజధానిఅంతటా ఒకే పద్ధతి ఏర్పాటవుతున్నది. అంతా రైత్వారీ భూమి, అనగా భూస్వామికిన్ని సర్కారుకున్నూ నేరైన సంబంధమే ఉంటుంది. మలబారులో భూమివిధానం వేరు.

ఈ రాష్ట్రంలోను దేశం మొత్తంమీదను రాజ్యంచేస్తున్నట్టి కాంగ్రెస్ సంస్థయొక్క కార్యసంఘం, ఇప్పటి శాసనసభల ఎన్నికల సందర్భమున 1945 లో వెల్లడించిన ప్రణాళికలో సర్కారుకున్ను సాగుచేసే రైతుకున్ను మధ్యానఉండేవారికి తగు పరిహారమిచ్చి వారి హక్కులను రాబట్టుకోవలసియుండునని కాంగ్రెస్ కార్యక్రమాంశముగా చెప్పిఉన్నది. ఆప్రకారము మద్రాస్ ప్రభుత్వము ప్రథమంగా జమీందారీలను రద్దుచేసి రెండోవిడతగా రైత్వారీ సంస్కరణకు పూనుకొనుచుండుట సమంజసమే కాదు, ముదావహమున్ను.

అయితే రైత్వారీ అన్నపుడు భూస్వామికీ సర్కారుకూ మధ్యాన ఎవరూ లేరని పైనచెప్పినదాన్నిబట్టి తేలుతున్నది గదా! ఈ సంస్కరణ ఏమిటి? అంటే సాగుచేసే రైతు అన్నమాటను పురస్కరించుకొని ఈ ప్రశ్న పైకొచ్చిందని చెప్పవలసి ఉంటుంది. జమీందారీలు పోవలెననటానికి చెప్పిన అనేక కారణాల్లో కొన్ని ఏమంటే; వాళ్లు 1. జమీమీద ఉండరు 2. కమతం స్వయంగా చూడరు అని. సందర్భాన్నిబట్టి దీన్ని రైత్వారీకి అన్వయిస్తే ఇక్కడ గూడా జమీందార్లతో సమానులైనవారు కొందరు మనకు కనిపిస్తారు. వీరు భూస్వాములు, కామందులు. వీరిలో కొందరు స్వతంగా కమతం చూచుకోరు. కొందరు గ్రామంలోనే ఉండరు. కొందరుమాత్రం స్వయంగా కష్టించి మట్టిని బంగారంగా మార్చి సుఖిస్తారు. వీరు అసలైన రైతులు. మరికొందరు స్వయంగా పాలప్పనులు, కమతం చూచుకుంటూ పాలేళ్లను పెట్టుకొని వ్యవసాయం చేసుకుంటారు. వీరు రెండోరకం. వీరు ఉభయులూ అనగా కేవలం తామే కష్టించేవారూ, గట్టుమీద కూచొని కర్రపెత్తనం చేసేవారూ ఒకఎత్తు; కట్టుబడికి ఇచ్చో, జిరాయితీకి ఇచ్చో గ్రామంలోనే ఉండేవారు, గ్రామంలో గూడా ఉండకుండా ఇతరత్రా పోయి వేరే జీవనోపాధి కల్పించుకున్నవారు - ఈ ఉభయులు ఇంకోఎత్తు.

ఇపుడు క్రొత్తగా ఏర్పాటైన భూమిశిస్తుసంస్కరణలసంఘం విచారించవలసిన ముఖ్యప్రశ్నల్లోకల్ల ముఖ్యమైనది ఈపైన వివరించినదే. జమీందారీనుంచి రైత్వారీకి మారుతున్న పదిపన్నెండువేల గ్రామాలు సహితంగా రాజధానిలో మొత్తం రైత్వారీ గ్రామాలు సుమారు 35 వేలు ఉన్నవి. బంజర్లు, పోరంబోకలు సహితంగా సాగుకు లాయకైనభూమి సుమారు 5 కోట్ల ఎకరాలు ఉంది. సాగవుతున్న భూమి 3 కోట్ల ఎకరాలు మాత్రమే. ఇందులో అయిదోవంతు మాత్రం మాగాణిభూమి, మిగిలినది మెరక అనగా మాగాణివలె నిత్యజలాధారసదుపాయం లేనట్టివి. మాగాణి మెరకవిస్తీర్ణం 135 వేల చదరపుమైళ్ళు. జమీందారీభూమి రైత్వారీమాదిరి సెటిల్మెంటు కానిదే ఆ భూమిభోగట్టా, పట్టాదార్లు వగైరా వివరాలు చెప్పటకు వీలుకాదు. రైత్వారీలో వెయ్యిరూపాయలకు మించి భూమిశిస్తు చెల్లించే పట్టాదార్లు రెండువేల లోపు ఉన్నారు. వీరిలో సుమారు 500 మంది మాత్రం జాయింటు పట్టాదార్లు. రు. 500—1000 మధ్యగ శిస్తుచెల్లిచే పట్టాదార్లు సుమారు 3000 మంది; వీరిలో జాయింటు సుమారు 700. 6250—500 మధ్యగ శిస్తుచెల్లించే పట్టాదార్లు సుమారు పదివేలమంది; వీరిలో రమారమి 2000 జాయింటుపట్టాదార్లు. రు 100—250 మధ్యగ శిస్తు చెల్లించే పట్టాదార్లు దాదాపు 50 వేలమంది; వీరిలో జాయింటు పదివేలు. రు 50—100 మధ్య పట్టాదార్లు లక్షానలభై వేలు, వీరిలో జాయింటు 50 వేలు. రు 10—50 మధ్యవారు సుమారు ప[illegible] లక్షలు; వీరిలో జాయింటు ఆరులక్షలు. రు 1—10 మధ్యవారు 40 లక్షలు వీరిలో జాయంటు సుమారు 16 లక్షలు. రూపాయకు తక్కువ శిస్తు చెల్లించే పట్టాదార్లు రమారమి 17 లక్షలమంది ఉన్నారు వీరిలో జాయంటు 8 లక్షలుంటాయి. రా

ధాని మొత్తంమీద జనాభా 5 కోట్లలోకిన్ని గ్రామసీమల జనాభా 3 కోట్లలోకి సుమారు 70 లక్షలమంది పట్టాదార్లు ఉన్నారు. 21138 రైత్వారీ గ్రామాల్లో భూములు గలిగిఉన్నారు.

రైత్వారీలోగల ముఖ్యాంశాలు కొన్ని ఇంకా విచారిద్దాం. స్వంతగా సేద్యం చేయని భూస్వాములకున్ను, సేద్యంచేసే రైతులకున్ను సంబంధం రకరకాలుగా ఉంది. స్వంతభూమిలేకుండా ఇతరులవి సేద్యంచేసే పాలేళ్లు, కూలీలు వగైరా ఉన్నారు. స్వంతంగా సేద్యం చేసికోకపోయినా వ్యవసాయమే జీవనాధారంగా గల భూస్వాములున్నారు. వేరే జీవిక చూచుకుంటూ వ్యవసాయం ఉపవృత్తిగా గలిగిన గైర్హాజరు భూస్వాములున్నారు. ఇప్పటి భూమిశిస్తుమదింపు 30 ఏళ్ళ కొకసారి జరుగుతున్నది. ఈ రీసెటిల్మెంటులో కష్టనష్టాలు ఉన్నవి. శిస్తు రొక్కం రూపేణా ఉండటం రైతులకంత హితంకాదు. భూమిశిస్తు సెస్సులు వగైరా కలుపుకుంటే ఇప్పటి మన హీనవ్యవసాయస్థితిలో చాల భారమైనదే నని చెప్పాలి. ఉద్యోగస్థులు మొదలైనవారికి రు. 3,600 లోపు ఆదాయపు పన్ను లేదు. వృత్తిపన్ను చాలా స్వల్పమైనది. కాని అరఎకరంభూమి ఉన్నా మూడునాలుగు రూపాయలు పన్ను తప్పదు. కనుక శిస్తు మదింపుపద్ధతి తాజాగా ఆధునిక పద్ధతులమీద ఏర్పరచాలి. ఫలసాయంపన్ను విధించే సంగతి తప్పకుండా యోచించతగినది. సెస్సులు మొదలైనవి తీసేసి కుల్లు మొత్తంగా ఒకేఒకశిస్తు ఇంత అని విధించి వసూలుచేయటం అవసరం. గ్రామపరిపాలనలోకూడా కొన్ని సంస్కరణలు అవసరము. అలాగే గ్రామతాలూకా రివిన్యూ లెక్కలనుగూడ నేషనల్ ప్లానింగ్ దృష్ట్యాన్ను, సాంఖ్య (*Statistical*) వ్యవస్థదృష్ట్యాన్ను సంస్కరించాలి. సేద్యం చేసే రైతు అనేమాటతో జేరినది లాభసాటి పొలాల విస్తీర్ణం కనీసపరిమితిని నిర్ణయించడము, ఎవరికీ ఇంతకు మించి పొలం ఉండకూడదు అని గరిష్ఠపరిమితిని నిర్ణయించడమూను. పాలేళ్లు కూలీలవేతనాలనుగూర్చి కేంద్రప్రభుత్వము చేస్తున్న విచారణ దృష్ట్యా ఈ రాజధానిలో సందర్భాలు విచారించి వ్యవసాయానికి హాని కలగనిరీతిని తగు ఏర్పాటు చేయవలసిఉంటుంది. వ్యవసాయంమీద జీవించే కుటుంబానికి మాగాణి కనీసం 5 ఏకరాలు, మెరక 10 లేక 15 ఎకరాలు ఆవశ్యకమని మాచాయగా తేలును. ఉన్న భూమిని వ్యవసాయదార్లకి సమంగా పంచితే మనిషికి ఎకరాకన్న రాదు కనుక ఆయీవిషయాలన్నీ సమగ్రంగా పరిశీలించి ఆయాల్లో పెంచి, గ్రామం విడిచి పోయే భూస్వాముల హక్కులకు పరిహారమిచ్చి రాబట్టుకొని, గ్రామంలోని రైతాంగానికి సులువైన విధంగా శిస్తులు ఏర్పాటుచేసి గ్రామంలో రైతులు సుఖజీవనం చేస్తూ, ఫలసాయం హెచ్చుచేయుటకు ప్రోత్సాహముగా సుబ్రమణ్యంకమిటీవారు తగు శిఫారసులు కావించెదరని మన మూహించవచ్చును.

---

## మధుర దేవాలయం

(35 వ పేజీ తరువాయి)

ప్రతిష్ఠితులైరి. ఆలయప్రవేశసన్నిధిని అష్టలక్ష్మీమండపము గలదు. ఈ మండపము వరచిద్వారముదగ్గర ఎడమవైపు గణేశవిగ్రహము, కుడివైపు సుబ్రహ్మణ్యవిగ్రహము గలవు. సమీపమందు నాయకుల ప్రధానమంత్రి మీనాక్షీనాయకుడు కట్టించిన మరొక మంటపము గలదు. చీకటిమండపములో అనేకభంగిమలలో నున్న శివుని ప్రతిమలు గలవు. మీనాక్షీసుందరేశ్వరుల గుడులపైన బంగారువిమానము. లోపలివైపు బంగారుపూత గలవు. సుందరుని ఆలయము చుట్టూ చక్కని ప్రాకారము గలదు. ఇది పాండ్యరాజులు కట్టించినది. దీని కుడివైపు గోడమీదిశాసనములు ఆలయచరిత్రమును దెల్పుచున్నవి. ఈ ప్రాకారాంతమున 100 స్తంభముల మండపము గలదు. ఇందులో చిదంబరములోవలె కాక సభాపతివిగ్రహమున్నది. ఈ మంటపము ప్రక్కన నవగ్రహ మంటపము గలదు; వీరవసంతరాయమంటపము, మధ్యసహస్రస్తంభమంటపము గలదు.

మధురఆలయంలో శిల్పకళ వెల్లివిరిసింది. పుదు లేక వసంతమండపములో *Facade* సింహములు గజముల త్రొక్కునట్లు లేక గుఱ్ఱపురౌతు గుఱ్ఱపుడెక్కలు కాల్బంటుల కవచములపై ఆనునట్లు గలవు. అష్టలక్ష్మీ మండపములో మీనాక్షీజననము, శివునితో పోరాటము, శివునితో కల్యాణము, సుబ్రహ్మణ్యస్వామిజననము, సుందరేశ్వరుని సార్వభౌమత్వము శిల్పరూపమున గలవు. మరోస్థలంలో శివుడు కిరాతుడుగను, మీనాక్షి చెంచెతగను చిత్రితులైరి. పద్మసరస్సుచుట్టుగల ప్రాకారపు గోడలపై శివుడు మధురలో చేసిన 64 విచిత్రచర్యలు, యితర పురాణగాథలు వుత్సవములకై వచ్చు ప్రజల వినోదార్థము చెక్కబడినవి. మరొక స్థలమున పంచపాండవుల ప్రతిమలు, వాలి సుగ్రీవులు, హరిశ్చంద్ర చంద్రమతులు శిల్పమున గలరు. ఒక మంటపములో శివుని భంగిమలు 25 గలవు. ఈ మంటపస్తంభము మీద శివుడు దక్షుని సంహరించుట, శివుడు కాళీనృత్యము సల్పుట గలవు. వసంతమంటపములో ఆర్యనాయకుడు గుఱ్ఱముపై నాసీనుడైయున్న ప్రతిమ గలదు. పుదుమంటపములో ఐదు స్తంభములమీద నాయకరాజుల ప్రతిమలు గలవు. తలపై కిరీటములు, క్రింద వస్త్రములు గలవు. ప్రతిమలక్రింద పేరు చెక్కబడి యున్నవి. రాజులు, రాణీ పరివారసమేతముగ నున్నారు. ప్రతిమలపై వర్ణములు వేయబడినవి. కొన్నిటి ముఖములకు పసుపురంగు వేయబడినది. తిరుమలనాయకుని ప్రతిమపైన చాందినీ గలదు. శ్రీవిల్లిపుత్తూరు తిరుప్పరకున్రం, అలగర్‌కోయిల్‌లలో గల తిరుమలనాయకుని విగ్రహములకు మధుర ఆలయములోని ప్రతిమకు పోలికలు గలవు.

---

# మన దేశం

(8 పేజీ తరువాయి)

బ్లిక్ వ్యవస్థకి తగినట్లు మంత్రివర్గం పునర్నిర్మించబడిందనే భావమే ఎవరికీ కలగలేదు. అంతా పాతమంత్రులే.

ఆంధ్రదేశానికి జరుగుతున్న అన్యాయాన్ని కేంద్రనాయకులు గమనించకపోగా, ఇప్పుడు నియమించబడిన కొత్త మంత్రులిద్దరూ ఆంధ్రులపట్ల ప్రత్యక్ష విరోధభావం ప్రకటించినవారే వచ్చారు. మంత్రివర్గంలో ఉత్తరప్రదేశ్, బొంబాయి రాష్ట్రాలవారే సగానికిపైగా ఉన్నారు. మొత్తం 14 మందిలో బొంబాయికి చెందిన వారు 5 మంది. ఉత్తర ప్రదేశ్—3. పంజాబ్—2. మిగిలినవారిలో తమిళ్నాడు, ఒరిస్సా, బీహారు రాష్ట్రాలకి చెందిన వారొక్కొక్కరు చొప్పున ముగ్గురు. జైరాందాస్ దౌలత్ రామ్ గారు సింధునుంచి వచ్చిన శరణార్థి. దీని అర్థం మిగతా రాష్ట్రాలలో సమర్థులు లేరని వీరి అభిప్రాయమా? దేశ పరిపాలనావిధానంలో ఆశ్రితపక్షపాతానికి గాని అనుమానానికిగాని తావివ్వడంకంటె, అవివేకం ఉండదు. ఒక ఉపజాతిపట్ల ఇటువంటి వైఖరివల్ల ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ అనైక్యతకూ ప్రాంతీయ అభిమానాలకూ (దురభిమానాలకూ) ప్రోత్సాహమిచ్చినట్లే. తమ విధానంలో లోపా లుంచుకుని తత్ఫలితంగా సంభవించే "భాషాభిమానాలు" మొదలైనవానికిఅన్యుల్ని నిందించినందువల్ల ప్రయోజనం ఉండదు. మున్షీ గారి దురహంకారపూరితమైన ప్రాంతీయాభిమానం. భాషాప్రయుక్త ప్రాంతవిభజనసూత్రానికి విరుద్ధంగా వారు చేస్తున్న దుష్ప్రచారం వీరికి మించి మరే సిద్ధాంతమూ ఆంధ్రరాష్ట్ర ప్రజల ప్రాంతీయాభిమానాలకు ఇంతగా దోహదమివ్వ లేదు కేంద్రనాయకుల వైఖరి ఆంధ్రదేశంలో ఎవరికీ బోధపడ్డంలేదు. తామై న్యాయం చేకూర్చకపోగా, న్యాయం చేకూర్చాలని కోరడాన్ని ప్రాంతీయదురభిమానం కింద జమకట్టుతున్న కేంద్రనాయకుల ప్రవర్తన ఆంధ్రదేశంలో తీవ్రమైన అసంతృప్తి కలిగిస్తున్నది. ఇంతవరకూ కాంగ్రెస్ ఆంధ్రదేశాని కేమి చేసిందో ఎవరికీ బోధపడదు. ఇంతవరకూ జరుగుతున్న రీతిని పరిపాలన కొనసాగించాలంటే ఐ. సి. యస్, ఐ. ఏ. యస్ ఉద్యోగులు ఇంతకంటె మేలుగా నిర్వహించగలరు. ప్రస్తుతం పరిపాలన కాంగ్రెసే నిర్వహిస్తున్నది అనుకోడానికి దేశంలో మద్యనిషేధం, కాంగ్రెస్ శాసనసభ్యులు, మంత్రులసంచారాలుతప్ప వేరేసూచన కానరాదు. ఈతెచ్చినదైనా ప్రజలకి రవంతఉపయోగపడలేదు. ఇంక మనకు మిగిలినది: దేశవ్యవహారాలలో ఆంధ్రదేశం ఎక్కడా ఎవరికీ జ్ఞప్తికి రాదు. ఆర్థికాభివృద్ధి కార్యక్రమాల్లో చెన్నరాష్ట్రం పేరు చెప్పి ఆంధ్రుల నోట్లో మన్నుకొడుతున్నారు. ఆంధ్రదేశంపట్ల అందరికీ ఒక్కటే శ్రద్ధేనని పిస్తున్నది కమ్యూనిస్టుల్ని కనిపించిన చోటెల్లా కాల్చిచంపడం. ఇంక ఏ ఆత్మవిశ్వాసంతో కాంగ్రెసునాయకులు ఆంధ్రదేశంలో ప్రజల ప్రాపును అర్థించగలరో తెలియదు. ఈనాడు కాంగ్రెస్ పేరుచెప్తే అధికారుల ప్రాపకం ఆర్జించుకోడానికి, తగవుల్లో కక్షలు తీర్చుకోడానికీ, వ్యాపారాభివృద్ధి చేసుకోడానికే మాత్రమే నాటకరంగంలా ఉపయోగపడుతోంది. ఈ పరిస్థితికి ఫలితాలే దేశంలో అసంతృప్తి, అరాచకం, ప్రాంతీయాభిమానం. అరాచకం ప్రాంతీయాభిమానం ఆంధ్రుల సైజం అన్నాడొకతమిళనాడు నాయకుడు. ఇదే కేంద్రనాయకుల అభిప్రాయం కూడానని అనేకమార్లు ధ్రువపడింది. ఈ అపోహని తొలగించడానికి ఆంధ్రకాంగ్రెస్ కృషి చేయలేకపోయింది. మద్రాసుప్రభుత్వం స్వార్థాశయంతో ఈ అపోహని ధ్రువపర్చడానికి శతథా కృషి చేస్తోంది. ఆంధ్రులికి అన్యాయం చెయ్యడం అదేమంటే ప్రాంతీయదురభిమానం అనడం, ఢిల్లీలో పెద్దలు ఇది జాతీయైక్యతకి ముప్పు అని బెంగపడ్డం, ఆంధ్రకాంగ్రెస్ నాయకులికి చల్లచల్లగా చీవాట్లు పెట్టడం, ఢిల్లీలో చీవాట్లు తిన్న నాయకులలో ప్రతి ఒక్కరూ దేశానికివచ్చి ఇతర నాయకులందరిదీ సంకుచిత ఆంధ్రాభిమానం అని నిందించడం పరిపాటి అయిపోయింది. దీనితో ఈ నాయకుల రాజకీయోద్యోగం నానాటికీ వృద్ధిపొంది ప్రజలస్థితి నానాటికీ దిగనాసిల్లిపోతోంది. ఆంధ్రదేశ పరిస్థితిని అవగాహన చేసుకోకుండా వ్యవహరిస్తున్నారని కేంద్రకాంగ్రెస్ నాయకులిని, అవగాహన చేసుకుని కొంపకూ చేసుకొనకకొంపకూ వ్యవహరిస్తున్నారనిమద్రాసు మంత్రులికీ నిర్భయంగా చెప్పగల ఆంధ్రకాంగ్రెస్ నాయకుడొక్కడూ కనిపించడం లేదు.

ఒక్క విషయాన్నిచూస్తే మన మద్రాసు ముఖ్యమంత్రికి ఆంధ్రదేశసమస్య లెంతగా అవగాహనైనాయో తెలుసుకోవచ్చును. కమ్యూనిస్టులు నేడు జరుపుతున్న చర్యలు గొరిల్లాచర్యలు కావన్నారు.. అక్కడక్కడ దెబ్బతీసి ఉడాయిస్తున్నారే కాని మరేం చెయ్యడం లేదన్నారు. దెబ్బతీసి ఉడాయించడం అంటేనే గొరిల్లా పద్ధతి అనే సంగతి మన ముఖ్యమంత్రిగారికి తెలియలేదు. మద్రాసు పోలీసులికికూడా లేని సైన్‌గన్‌లూ మొదలైనవి తీసుకొని ఊళ్లమీద దాడిచేస్తారంటే, పోలీసుదళాలకి అవసరమైనంత ఆయుధ సామగ్రి ఇవ్వడంలేదు. ఆంధ్రదేశం ముక్కూ మొఖమూ తెలియని పోలీసుఆఫీసర్లని ఆంధ్రదేశంలో కమ్యూనిస్టుల్ని అణచడానికి నియమిస్తున్నారు. గ్రామరక్షకదళాల పేరు చెప్పి హరిజనుల్నీ, పేదకూలీల్నీ బలవంతంగా చేర్చినట్లయితే చివరికి ఇవి గ్రామభక్షకదళాలౌతాయనే సంకోచం వారికిలేదు. కలవారి ఆస్తిపాస్తుల్ని కాపాడ్డానికి లేని వారికేం పట్టిందనే గ్రహింపులేదు. హైదరాబాద్ పైచర్యకాలంలో అరాచకాన్ని అణచడంలో అనుభవం, సామర్థ్యం కలిగి పేరు గడించిన పోలీసుఆఫీసర్లని ఇతరత్రా తొక్కిపట్టిఉంచారు. మలబార్‌లో కమ్యూనిస్టుల అరాచకాన్ని రెండుమాసాల్లో అణచివేసిన పోలీసు ఆఫీసర్ని కొందరు కాంగ్రెస్ నాయకుల ఆక్షేపణవల్ల కృష్ణాజిల్లాలో నియమించలేకపోయారు. పరిస్థితులీతీరుగా ఎంతకాలం కొనసాగుతాయి! త్వరలోనే ఎన్నికలు రానున్నాయి. ఆ ఎన్నికలలోగానైనా ప్రజలవిశ్వాసాన్ని పునరుద్ధరించడానికి ఏవో యత్నాలు జరుగుతున్నాయి. అయినా చెన్నరాష్ట్ర మంత్రివర్గాన్ని పునర్నిర్మించవలసిన అగత్యం ఇంతవరకెవరికి కనిపించకపోవడమే ఆశ్చర్యం.

కాంగ్రెస్ కార్యవర్గం బహుశా ఎన్నికల్ని దృష్టిలోఉంచుకొనే ప్రకాశంగారిపైన "క్రమశిక్షణచర్యనోటీసుని ఉపసంహరించుకోవచ్చును" అని సందిగ్ధంగా నిర్ణయించింది. మళ్లీ ఎన్నికలయ్యేవరకూ ఇకనుంచి ఎవరిపైనా శిక్షణచర్య తీసుకోరాదని రాష్ట్రకాంగ్రెస్ కమిటీలకు ఆదేశమిచ్చింది-దీనిల్ల ఎన్నికల లోగా ప్రకాశంగారివ్యవహారం తిరిగి రాబోదని భావించటానికి వీలిస్తున్నది. [సీతారామ్]

[గల్పిక]

# క్లిష్ట సమస్య

శ్రీ కొడవటిగంటి
కుటుంబరావు

కామయ్య పెదనాన్న చాలా ఖిన్నుడై కనిపించాడు.

"ఏం, పెదనాన్నా? ఎందు కట్లా చింతా క్రాంతుడివై ఉన్నావు?" అన్నాను.

"ఖర్మ, ఏం చెప్పేదిరా? ఇద్దరు దెధవలూ చెప్పినమాట వినకుండా చెడిపోతున్నారు. నేను జీవించి ఉండగానే వీ ళ్ళిట్లా ఎందునా కాకుండా పోతుంటే నేను కాస్తా హరీ అన్నమీదట వాళ్లకు పట్టపగ్గా లుంటాయా అని!" అన్నాడు పె.

"ఏం? ఏమంటా రేం?"

"ఏమంటారూ? దేవుడు లేట్ట, దెయ్యా లేవుట! కులాలూ మతాలూ లేవుట! అ దేమిటో! — వర్గాలు! — వర్గా లున్నవిట, దోపిడీవర్గాలుట, పీడితవర్గాలుట! నేను దోపిడీవర్గంట, వాళ్లు పీడితవర్గాలుట! ఇద్దరూ నే చెప్పినట్టు పెళ్లాడరుట. ఏ అడుక్కుతినేవాళ్లనో పెళ్లాడతారుట! విన్నావు గదూ? వా ళ్లసలు నాతో మాట్లాడరు —"

"కమ్యూనిస్టుమతంగానీ పుచ్చుకున్నారేమో?" అన్నాను.

"ఏం పొద్దో?" అన్నాడు పె.

"డబ్బు లడిగితే ఇవ్వకు. రోగం వొదుల్తుంది," అన్నాను.

"వాళ్లు న న్నిప్పుడు డబ్బు లడగరుగా?"

"ఇదోట్రా? తిండికన్నా వస్తారా?"

"వస్తారు. వాళ్ళమ్మ కాళ్లా వేళ్లా పడితేగాని, తినరు."

"చాలా ముదిరింది. తిండి పెట్టటం మాని చూడు."

"వారంరోజులు అదీ చూశా! వాళ్లు ఎక్కడో తింటున్నారు. అందుకని మానేశా! ఏ శూద్రకూళ్లు తింటారో అని!"

"పోనీ, వా ళ్లిష్టమొచ్చినట్లు పోనీ. పెద్దవాడివి ఎంతకని ఇదవుతావు? చిన్న వెధవలా, చితకవెధవలా?"

"అదే కాదుట్రా, నా యేడుపూ? ఇద్దరికీ సంబంధా లొస్తున్నయ్. చెరో అయిదేసి వేలన్నా కట్నం మిస్తారు కళ్ళకద్దుకు! వీళ్లు చూడబోతే కట్టైనా, కంపనా కొలరాయిరి."

పెదనాన్నకు పాపం పెద్ద చిక్కే వచ్చింది.

"ఇదంతా వీళ్లకు పుట్టిన బుద్ధి కాదు. వాడున్నాడే - ఆ పాపాలభైరవుడు - మా ఆఖరు బావమరిది? వాడు పెడుతున్నాడు వీళ్లకీ బుద్ధులన్నీ. వాడు నాస్తికుడు. ఎప్పుడో జంధ్యం తెంచేసి దేవు ళ్లేరన్నాడు. భాగం పంచుకోమని కూడా వాడే వీళ్లకు బోధిస్తూ ఉండే ఉంటాడు."

"భాగాలు పంచమంటున్నారు కూడానా?"

"నే చెప్పే దేమిటి? భాగాలు పంచమనకపోతే వాళ్లను ఎట్లాగన్నా ఏడవనీ, నా కేం? వీళ్లకు భాగం పంచానే అనుకో ఏమవుతుంది? ఆ ఉన్నదికాస్తా అమ్మేసి బీదవాళ్లందరికీ పంచుతా మంటారు. నే బతికుండగానే! నా కళ్లెదటే!"

నేనేమీ మాట్లాడలేదు. ఏముంది మాట్లాడ డానికి?

"నువు రాజకీయాలు తెలిసినవాడివి. ఏదన్నా ఉపాయం చెబుదూ!" అన్నాడు పె.

"దేనికని చెప్పను? నీ సమస్య ఏమిటో నా కర్థం కావటంలేదు. దాని స్వరూపం క్షణక్షణానికీ మారుతున్నది," అన్నాను.

"నాకు మరేమీ అక్కర్లేదు. వాళ్లు మా బావమరిదిమాట వినకుండా ఉపాయం చెబుదూ!"

"చూడు, పెదనాన్నా! దీని కొక గొప్ప అంతర్జాతీయతన్నా ఉంది. అది ప్రయోగించి చూడు." అన్నాను.

"ఏమిట్రా అదీ?" అన్నాడు పె. ఆత్రంగా.

"నువ్వు నీ కొడుకుల్ని విపక్షం చేసుకోవాలంటే మీ బావమరిది ఏయే ఉపదేశాలు చేస్తున్నాడో అవన్నీ నువే చెయ్యి. మీ బావమరిది చెప్పే సిద్ధాంతాలను నువే అమలుచేస్తా నను. దేవుళ్లూ, దెయ్యాలూ లేవని ఒప్పుకో. కులాలు లేవని ఒప్పుకో. వా ళ్లిష్టమొచ్చినవాళ్లను పెళ్లాడనీ!"

పె. కాస్త అనుమానిస్తూ, "ఇందులో ఏమీ మోసం లేదుకద? అన్నాడు"

"లేదు. పెదనాన్నా! చాలా గొప్ప గొప్ప రాజకీయవేత్తలు బహిరంగంగా ఈ ఉపాయాన్ని అమలు చేస్తున్నారు" అన్నాను.

* * *

మా పెదనాన్న ఏం చేశాడో నాకైతే తెలీదు. ఇటీవలనే ఆయనకొడుకు లిద్దరూ చెరో "శ్రామిక" పిల్లనూ పెళ్లాడినట్టు తెలిసింది. నా విచారమల్లా, ఇంత గొప్ప అంతర్జాతీయయుక్తి పారకుండాపోయెనే అని.

## కులాసా కబుర్లు

(36-వ పేజీ తరువాయి)

నాయకుడు, రచయిత, మేధావి. అనేక వ్యాపకాలు ఉన్న ప్రతిభావంతుడు. షష్టిపూర్తి అయినా ఉత్సాహంలో యువకులలో యువకుడు. అలసిపోవటం అంటూ ఎరగడు, ప్రతిదీ చూడాలనే కుతూహలంలో పసిపిల్లవాడిలాంటివాడు. ఇవన్నీ అమెరికనుల దృష్టిలో అభిమానలక్షణాలుగా తయారైనవి.

ఇవి లోపించటంవల్ల ఆలీగారి విలేఖరుల కాన్ఫరెన్సు నెహ్రూగారి కాన్ఫరెన్సు మాదిరి కాకుండా పదిహేనునిమిషాలలో పూర్తి అయిందిట. విలేఖరులకు అడగటానికి ప్రశ్నలు తోచలేదుట. అయితే ఇందువల్ల ఆలీగారు చిన్నపుచ్చుకుని ఆ కోపమంతా మనవైపు రవాణా చేస్తాడని మనం అనుకో నక్కరలేదు. కాని ఒక్కవిషయంమాత్రం నిక్కచ్చిగా చెప్పవచ్చు.

ఇన్నాళ్లూ పెట్టిన విసిరాట్లు విరోధులు స్నేహితులుగా మారినప్పుడు, కొంత చికాకు కలుగచేయక తప్పదు. ఏ రోజుకు ఎట్లా ఉంటుందో నని కొత్త పస్తాయిస్తే యీ సంకటం తప్పేది.

అఖిలభారత కన్నడ మహాసభకు అధ్యక్షత వహించనున్న శ్రీ గోపాలాచారిగారు(మధ్యనున్నవారు)



తెనాలిలోజరిగిన ఆంధ్రరాష్ట్ర హోటలువర్కర్సు మహాసభ

Regd. No. M. **4479**



Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras.